# మావో సే-టుంగ్ జీవితచరిత్ర

[ బాల్యము, యవ్వనం ]



రచన :

ఎమి సి యావో

అనువాదం :

తాపీ మోహనరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

2/126

# ఒకటో అధ్యాయం

[సామ్రాజ్యవాద, జమీందారీ పీడనక్రింద
బాల్యావస్థ]

# చైనా రైతు బిడ్డ

షావోషాన్ చుంగ్ హునాన్ రాష్ట్రంలో సియాంగ్‌టాన్ కౌంటీ (తాలూకా)లోని ఒక కుగ్రామం. ఇంచుమించు మూడున్నర మైళ్ళవరకు ఆ గ్రామం విస్తరించి ఉంటుంది. దాని పరిసరాలు చాల రమణీయం. చుట్టూ కొండలు, నదీజలాలు. యాత్రికులను పరవశం చేసే దక్షిణాది ప్రకృతిశోభతో అలరారుతుంటుంది ఆ గ్రామం. అందులో ఇళ్ళు బహుకొద్ది అవికూడా దూరదూరంగా చెదిరి ఉంటాయి. ఆ గ్రామస్థులు చాలవరకు మర్యాదస్తులు, రెక్కలకష్టం మీద బతికే రైతులు. ఆ రైతుకుటుంబాల్లో ఒకటి మావో కుటుంబం.

షావోషాన్ చాంగ్‌లో ఎగువ దక్షిణపుగట్టు, దిగువ దక్షిణపుగట్టు అని ఉన్నాయి. దిగువ దక్షిణపుగట్టు వెంబడే సియాంగ్‌టాన్ నగరానికి, పొరుగుతాలూకా అయిన సియాంగ్ సియాంగ్‌కి రోడ్డుపోతుంది. ఎగువగట్టుమీద ఒక రాతివంతెన, దానిచుట్టూ మాంసం, ఉప్పు, పప్పు మొదలయిన సరకులమ్మే అంగళ్ళు; ఆ వంతెన కిందనుంచి, షావోషాన్ గ్రామంతో ముచ్చట్లు చెప్పుకొంటూ ఒక, నది గలగలా ప్రవహిస్తుంది. దాని ఒడ్డునే ఒక చిన్న పెంకుటిల్లు. అందులో రెండుభాగాలు. ఇక సగంలో సౌకుటుంబం, రెండవ భాగంలో మావో కుటుంబం ఉండేవి. మధ్యనున్న పెద్దగదిలోనే రెండుభాగాల సరిహద్దు.

ఆ చిన్ని నిరుపేదకొంప ఎంత భాగ్యానికి నోచుకుంది! చైనా చరిత్రలో సాటిలేని ఉత్తమోత్తమ నాయకుడు, చైనా ప్రజల విమోచకుడు, భాగ్యవిధాత మావో-సే-టుంగ్, పురిటిసంబరం దానిసొత్తయింది. 1893 అక్టోబరు 19 వ తేదీని ఆ మహానాయకుడు ఆ ఇంటిలో జన్మించాడు.

మావో-సే-టుంగ్ తండ్రి మావో-షున్-షెంగ్. షున్-షెంగ్ పుట్టింది పేదరైతు కుటుంబంలో. మాంచి పొడవరి. దృఢకాయుడు. నడివయసు దాటిన దగ్గర్నుంచి తీర్చిదిద్దిన గడ్డం ఉండేది. కార్యదక్షత, కుశాగ్రబుద్ధి అతని లక్షణాలు. ఇంటిపనులు జాగ్రత్తగా చూచుకోవడం అంటే ఆయనకు మహా ఉత్సాహం.

పేరుకుపోయిన అప్పులు తీర్చటానికి మావో-షున్-షెంగ్ యుక్తవయసురాగానే సైన్యంలో చేరాడు. ఇంచుమించు ఒక ఏడాది గడచిన తరువాత తిరిగివచ్చి, చిన్న వ్యాపారం ప్రారంభించాడు. పొదుపరితనంతోనూ, వచ్చిన రాబడిని తెలివితేటలతో ఉపయోగిస్తూ, వ్యాపారాన్ని అభివృద్ధిచేసి కొంత ధనం కూడ బెట్టాడు. తాకట్టుపెట్టిన తన 2 యకరాల 14 సెంట్ల భూమిని విడిపించుకొని, స్వంత సేద్యంపెట్టి, మధ్యతరగతి రైతు హోదా కూడా పొందాడు.

ఆనాటికి మావో కుటుంబంలో ఉన్నది అయిదుగురు — మావో-సే-టుంగ్, అతని తలిదండ్రులు, తాత, తమ్ముడు సె-మన్. తండ్రి కృషి ఫలితంగా ఆ కుటుంబం పరిస్థితి, మూడుపువ్వులు ఆరు కాయలుగ క్రమక్రమాభివృద్ధి పొందుతూ వచ్చింది. కొద్దికాలంలోనే మరొక యకరం భూమినికూడా సంపాదించారు.

అది జరిగిన రెండేళ్ళకు తాత చనిపోయాడు. కాని మావో-సె-టుంగ్‌కి మరొక తమ్ముడు, ట్సె-టాన్ పుట్టడంవల్ల

కుటుంబంలో సంఖ్య ఏమీ తగ్గలేదు. వ్యాపారంలో వచ్చిన లాభాలను జాగ్రత్తగా వెనకేస్తూ తండ్రి, ధాన్యం, మాంసం ఎగుమతి వ్యాపారం ప్రారంభించాడు. ఇంకా ఎక్కువ భూమి సంపాదించి, చివరకు ధనికరైతయ్యాడు.

## ఆరేళ్లనుంచీ కాయకష్టం

సామ్రాజ్యవాదం, జమీందారీ విధానాలనే తిరగలిరాళ్ళ మధ్యపడి చైనా ప్రజలు నలిగిపోతూన్న సమయంలో మావో-సె-టుంగ్ జన్మించాడు. చైనా ప్రజల చరిత్రలో గాఢాంధకారబంధురమైన దశలలో అదొకటి.

19 వ శతాబ్దారంభంలోనే, పెట్టుబడిదారీ దేశాలు సామ్రాజ్యవాద పంథాలో అడుగుపెట్టాయి. దురాక్రమణ వ్యూహాలు ప్రారంభించాయి. మావో - సె - టుంగ్ జననానికి 53 సంవత్సరాల పూర్వమే, 1840 లో చైనామీద 'నల్లమందు యుద్ధం' జరిగింది. అది మొదలుగా పరాయి దురాక్రమణ యుద్ధ పరంపర ప్రారంభమయింది. తత్ఫలితంగా చైనామెడకు ఒక బానిస ఒడంబడిక తరువాత మరొక బానిస ఒడంబడిక చుట్టుకోసాగాయి. చైనా తన సర్వ స్వతంత్ర ప్రతిపత్తిని క్రమక్రమంగా కోల్పోసాగింది. పరాయి సామ్రాజ్యవాద దేశాలు చైనా భూభాగంలోనే తమ కిష్టంవచ్చిన ప్రదేశాలనీ, పలుకుబడి ప్రాంతాలనీ గుంజుకున్నాయి. 5 వేల సంవత్సరాలు మహోన్నత నాగరికతతో విరాజిల్లిన చైనా, క్రమ క్రమంగా అర్థవలస స్థితికి దిగజారింది. అంతే కాదు; సామ్రాజ్యవాద దేశాలు దానిని ముక్కచెక్కలుగ చీల్చి కబళించే ప్రమాదం కూడా ఏర్పడింది.

ఆనాటి మంచూ చక్రవర్తుల ప్రభుత్వపు అవినీతి, అసమర్థత ఊహింప శక్యంకానివి. విదేశాలపట్ల అది అర్థంలేని డాబు దర్పాలను ప్రదర్శిస్తూ వచ్చింది. కాని సామ్రాజ్యవాద దేశాలు కత్తి ఝుళిపించేసరికి తోకముడిచి, బానిసవలె మోకరించింది. ఎంతటి నీచాతి నీచ అవమానానికయినా అది తల ఒగ్గేది. ఎలాంటి బానిస షరతులనైనా, కిమ్మనకుండా శిరసావహించేది.

పరాయి సామ్రాజ్యవాదుల పాదాలవద్ద అలా మోకరించినా, ఇంట, తన ప్రజలపట్ల కఠోరమైన నియంతృత్వపు నిర్బంధాలకీ, దారుణ దోపిడీ విధానాలకు ఏమీ కొరతలేదు. వాటిని సహించలేక ప్రజలు సాగించే విప్లవ పోరాటాలను అణచేందుకు పరాయి సామ్రాజ్య వాదుల సహాయంకూడా అర్థించేందుకు వెనుదీసిందికాదు. సామ్రాజ్యవాదులు చైనాపై తాము సాగించిన దురాక్రమణ యుద్ధాలకు ఖర్చులకింద చైనానుండే నష్టపరిహారం గుంజేవారు. ఈ నష్టపరిహారాలను చెల్లించేందుకూ, మంచూ చక్రవర్తుల భోగాలకోసం, విదేశాలవద్ద తీసుకొనే అప్పులను చెల్లించేందుకూ, లంచగొండి ఉద్యోగాల దుర్దాహాన్ని తీర్చేందుకూ, ఆ జమీందారీప్రభుత్వం ఎంతటిఅఘాయిత్యానికైనా ఒడిగట్టేది. హద్దూ పద్దూ లేని పన్నులు, లెవీలు విధించి ప్రజలను పీల్చి పిప్పిచేసేది. దీనంతటి ఫలితంగా సమాజంలో అస్థిరత నానాటికి తీవ్రమయింది. ప్రజాజీవితం దుర్భరమయింది. మంచూ చక్రవర్తుల నిలువు దోపిడీకి అధికంగా గురిఅయి అలమటించినది రైతు ప్రజానీకమే.

విదేశాలతో చైనా వర్తకం ప్రారంభించిన దగ్గర్నుంచీ, పల్లెసీమలో విదేశీ సరకులు రాసులు పడనారంభించాయి. స్థానికంగా తయారయే చేనేత బట్టల స్థానాన్ని విదేశీ ఊలు, పత్తి మిల్లుబట్టలు ఆక్రమించుకున్నాయి. ఆముదం, కొబ్బరినూనె లాంటి

విత్తులనూనె అదృశ్యమై, కిరసనాయిలు సాక్షాత్కరించింది. చెకుముకిరాళ్లు మటుమాయమై, అగ్గిపెట్టెలు వెలిశాయి. ఇంట తయారయే రంగులు పోయి, విదేశీ వర్ణాలు ప్రత్యక్షమయాయి. చివరకు స్వదేశీ యేసులు కూడా నిలిచే యోగం లేక, విదేశీ యేసులకు తమ స్థానాన్ని అర్పించవలసి వచ్చింది. గ్రామ సీమల్లో ప్రజలు, వ్యవసాయ పనులమధ్య, తీరిక సమయాల్లో కొనసాగించుకుంటూ వచ్చిన చేతివృత్తులు సర్వనాశనమయే పరిస్థితు లేర్పడ్డాయి.

పెద్ద భూస్వాములు, వడ్డీ వ్యాపారులు మెల్ల మెల్లగా తమ భూములను కబళించివేయడంతో, రైతుల్లో ఎక్కువమందికి అంగుళం భూమికూడా లేకపోవడమో, లేక చాలీ చాలని చెక్కమాత్రం మిగలడమో జరిగింది. తత్ఫలితంగా ఆ రైతులు భూస్వాములనుండి, దుర్భరమైన శిస్తు రేట్లకు భూమిని కౌలుగా తీసుకొనక తప్పేదికాదు. ఏడాదిపొడుగునా రెక్కలు ముక్కలుచేసుకొని పండించిన పంట ఇంచుమించు పూర్తిగా శిస్తుకిందే చెల్లించేవారు. ఆ అవకాశం కూడా లేక, శ్రమశక్తిని అమ్ముకోవడం తప్ప మరొక బ్రతుకుతెరువు లేనివారు భూస్వాములకిందా, ధనిక రైతులకిందా వ్యవసాయ కూలీలుగా బ్రతికేవారు. ఈ దుస్థితి అంతా చాలదన్నట్లు పరాయి సామ్రాజ్యవాదుల దురాక్రమణ దాపురించింది. దానితో ప్రజా జీవనం మరింత అధ్వాన్న మయింది.

నల్లమందు యుద్ధం తరువాత, ఇరవై ఏళ్ళకి సియాంగ్‌టాన్ నగరంకూడా పరాయి సామ్రాజ్యవాదుల సరకుల గిడ్డంగిగా తయారయింది. క్వాంగ్‌టుంగ్ మీదుగా దిగుమతిఅయే సరకులకు అది పంపిణీకేంద్రంగా ఉండేది. అదేవిధంగా చైనానుండి ఎగుమతి అయే సిల్కు, తేయాకు మొదలైన సరకులు ముందు అక్కడకుచేరి, బేళ్లు కట్టడం వగైరా అయిన తరువాత క్వాంగ్‌టుంగ్‌కి రవాణాఅయేవి.

ఈవిధంగాసియాంగ్‌టాన్, క్వాంగ్‌టుంగ్‌లమధ్యవర్తకంముమ్మరంగా ఉండేది. ఎగుమతి దిగుమతి సరకులను రోడ్డుమీదుగా రవాణా చేసే పనిలోనే 1 లక్షమంది ఉండేవారట.

మావో - సె - టుంగ్ తండ్రి ఉంటూండిన గ్రామంకూడా ఈ విదేశీసంకుల దురాక్రమణ తాకిడికి గురిఅయింది. కాని, ఆయన దానిని తట్టుకొని నిలవగలిగాడు. ఒళ్లుదాచుకొని ఎరుగని అతనూ, అతని కుటుంబమూ మరింత పట్టుదలతో పనిచేయ నారంభించారు. సియాంగ్‌టాన్, నింగ్‌సియాంగ్, చాంగ్షా మొదలైన పెద్ద పట్టణాలకు తన గ్రామంనుండి మాంసము, ధాన్యాల రవాణాకే మావో-సే-టుంగ్ తండ్రి తన కాలాన్ని, శక్తిని ఎక్కువగా వినియోగించసాగాడు. పొలంపనులు చూడడానికి ఒక జీతగాడు ఉండేవాడు. వ్యవసాయ తరుణంలో నాట్లు,కలుపుతీత, కోతలు మొదలైన పనులకు కొద్దిమంది వ్యవసాయ కూలీలని అదనంగా తీసుకొనేవారు. అప్పటికి భార్యా, బిడ్డలవంతుకి చాలా పనులుమిగిలేవి. చలికాలంలో ధాన్యం దంచేందుకు ఒకరిని తాత్కాలికంగా పనిలోకి తీసుకునేవారు. అలాంటిరోజుల్లో అతనికికూడా తిండిపెట్టేవారు. భోజనాది విషయాల్లో ఎంతపొదుపుగాఉన్నా ఎవరికీ ఏమీ లోటుఉండేదికాదు.

ఏడేళ్ళు నిండీనిండకముందే మావో-సే-టుంగ్ పొలంమీద పనిచేయ నారంభించాడు. పదమూడోఏట, పెద్దవాళ్ళతో సరిసమానంగా పొలంపని చేయడంతోపాటు, సాయంత్ర మయేసరికి తండ్రి వ్యాపారంతాలూకు పద్దులన్నీ చూచేవాడు. అప్పటికి ఆయన ఆ కుటుంబంలో కల్లా మహాపండితుడు! అంటే ఆ కుటుంబంలో అందరికన్నా ఎక్కువ చైనాఅక్షరాలు నేర్చుకున్నాడన్నమాట. లెక్కలు కూడకంకూడా అతను నేర్చుకో వలసివచ్చింది. వేసవిలో తీరికగా ఉన్నప్పుడు వెన్నెట్లోకూర్చుని తండ్రి రెండుచేతుల వ్రేళ్ళ

మీాదా ఒకేసారి లెక్కలుకూడడం తన కొడుకులకు నేర్పేవాడు. ఇంట్లో తల్లీపిల్లల కెప్పుడూ దంపుడుబియ్యం అన్నమూ, కాయ గూరలే భోజనం. చాంద్రమానం ప్రకారం ప్రతినెలా ఒకటవతేదీన 15వ తేదీన వ్యవసాయకూలీలకు గుడ్లు, చేపలతోను, అప్పుడప్పుడు మాంసముతోను తిండి పెట్టినప్పుడుకూడా తల్లీపిల్లల భోజనంలో ఏమీా మార్పు ఉండేదికాదు.

గ్రామ జీవితంలో ఈ అనుభవాలూ, బాల్యంనుండి కాయ కష్టంలో పొందిన ఈ తరిఫీదూ, చైనా ప్రజానీకపు సాధకబాధ కాలనూ, వారి అవసరాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకునేందుకు మావో సే-టుంగ్‌కి బాగా ఉపయోగపడ్డాయి. పుట్టుకతోనే రైతు బిడ్డ పెరిగింది పల్లెపట్టున. రైతుజీవితంలో మునిగి తేలుతూ ఈ విధంగా చాలా చిన్న వయసులోనే ఆయనకు రైతు ప్రజాసామా న్యంతో అత్యంత సన్నిహితత్వం ఏర్పడింది.

## విశ్వాసపాత్రుడు

మావో-సే-టుంగ్ తల్లి కుటుంబంపేరు వెన్. ఆమె కన్న వారిది సియాంగ్ సియాంగ్ తాలూకాలోని టాంగ్‌చియాంగ్ ప్రాంతం. ఆమె సుగుణాలరాసి. పొట్టికాకుండా, పొడవుకాకుండా మధ్యస్థంగా ఉండేది. చదరంపుముఖం; మార్దవం ఉట్టిపడేకళ్ళు. బీదల పాలిట ఆమె ఒక పెన్నిధి. తరుగురోజుల్లోనూ, కరువుకాటకాలోనూ భర్తను తెలియకుండా బీదలకు ధాన్యంపంచనిది ఆమె నిద్రపోయేది కాదు. మంచితనానికి, పొదుపుగా ఇల్లు నడుపుకోడానికి ముందు ఆమెను చెప్పి, తక్కినవారిని చెప్పేవారు. మావో కుటుంబం అంత అభివృద్ధిలోకి వచ్చిందంటే అందుకు మావో-సే-టుంగ్ తండ్రి వ్యవ హార దక్షత ఎంతవరకు కారణమో, తల్లి శక్తి సామర్థ్యాలుకూడా

అంతే. సర్వసాధారణ రైతుస్త్రీ నిత్యకృత్యాలే ఇంటిలో ఆమెవంతు కూడా. బిడ్డల్ని చూచుకోవడం, కట్టెలుపోగుచేయడం, వంట, నూలు వడకడం, చినుగు చింకి కుట్టి బాగుచేయడం, బట్టలుతికి శుభ్రపర చటం – ఇదీ ఆమె దినసరిజీవితంలో కొంతభాగం.

మావో-సే-టుంగ్‌కి తల్లంటే పంచప్రాణాలు. ఎల్లప్పుడూ ఆమెమాట ఆయనకు వేదవాక్యం. ఆమెలో మూర్తీభవించిన అనేక సుగుణాల ప్రభావం, ఆయన భవిష్యత్ జీవితంపై ఎంతగానో కనుపిస్తుంది. ఆనాటి మావో-సే-టుంగ్ గుణగణాలనుగురించి ఆప్రాంతాల్లో కథలుగా చెప్పుకుంటూరు. వాటిలో ఇవి కొన్ని-

ఒక ఏడాది – కోతలు పూర్తి అయాయి. కుప్పలింకా అలా ఉండగానే వర్షంపట్టుకుంది. మావో-సే-టుంగ్ అప్పటికింకా చిన్న కుర్రవాడు. అయినా, తమకుప్పలమాట అటుంచి, ఘొరుగునున్న ఒక బీదకౌలుదారు కుప్పల్ని జాగ్రత్తపరచడానికి పరుగెత్తుకెళ్ళి సాయంచేశాడు.

ఇదిచూచి తండ్రి మండిపడ్డాడు. "వాళ్ళది బీదకుటుంబం. పైగా శిస్తుకట్టాలి. కొద్దిపాటినష్టం జరిగినా వాళ్ళకు కొంపమీదికొస్తుంది. మనపంటల విషయం అలాకాదుకదామరి..."అని మావో-సే-టుంగ్ జంకులేకుండా జవాబుచెప్పాడు.

♦ ♦ ♦

మంచి చలిరోజుల్లో ఒకనాడు స్కూలుకు వెళుతున్నాడు. చాలీచాలని, చింకిపాతలతో, వడవడ వణకిపోతున్న ఒక బీదకుర్రవాడు దారిలో కనుపించాడు. వెంటనే మావో-సే-టుంగ్ తన చలికోటుతీసి అతనిమీద కప్పాడు. సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు చలికోటు కనబడక పోయేసరికి తండ్రి సంజాయిషీ అడిగాడు.

♦ ♦ ♦

మరొకసారి - చైనా ఉగాదిపండక్కి ముందురోజులు. తండ్రి, అంతకుముందు ఒకరికి ఒక పందిని అమ్మాడు - దానితాలూకు డబ్బు రావలసిఉండి, మావో - సే - టుంగ్‌ని పంపాడు. అది వసూలు చేసుకుని తిరిగివస్తుంటే, దారిలో కొంతమంది నిరుపేదలు, మురికి పీలికలను కట్టుకొని కనుపించారు. వెనకా ముందూ ఆలోచించ కుండా, తనదగ్గరఉన్న డబ్బంతా వాళ్ళకిచ్చేశాడు.

♦ ♦ ♦

ఒకనాడు తండ్రి, తన కొడుల్నిద్దరినీ సోయాగింజలు ఏరుకు రమ్మని పొలం పంపించాడు. తమ్ముడు కొంచెంగడుసురకం. మొక్కలు పల్చగా, చెదురు చెదురుగాఉన్న ప్రాంతం ఎంచుకున్నాడు. అక్కడ పని తేలిక. పైగా కొద్దికాలంలో ఎక్కువపనిచేసినట్టు కనబడుతుంది.

మావో - సే - టుంగ్ అలాకాకుండా మొక్కలు దట్టంగా ఉండేచోటు, కోరి ఎంచుకొని, కష్టపడి పనిచేశాడు. ఎంతసేపున్నా అతనుముందుకు సాగుతున్నట్లే కనబడలేదు.

అంతలోకి తండ్రి వచ్చాడు. పొలంవంక చూచాడు. ఎంతో ఎక్కువపని చేసినట్లు కనబడిన చిన్నకొడుకుని మెచ్చుకొంటూ, పెద్దవాడిని నానామాటలన్నాడు. మావో - సే - టుంగ్ ఏమీ అనలేదు. తన దగ్గరనున్న గంపమాత్రం మూతతీసి చూపించాడు. తండ్రి నిర్ఘాంతపోయి, మళ్ళీ మాట్లాడలేదు.

♦ ♦ ♦

వీళ్ళఇంటికి దగ్గర్లో మావో అని ఒకాయన ఉండేవాడు. అత నొకసారి వీళ్ళనాన్నకు ఒక పందిని అమ్మాడు. వీళ్ళనాన్న పందికి ధర పూర్తిగా చెల్లించాడు. కాని, పందిని అప్పుడే తీసుకుపోలేదు. పదిహేను రోజులు గడిచాయి. ఈలోగా పందిమాంసము ధరబాగా పెరిగింది. అప్పుడాపందిని తోలుకురమ్మని మావో - సే - టుంగ్‌ని

పంపించాడు తండ్రి. పొరుగింటికివెళ్ళే సరికి, అతను - ఏమయ్యా, మాంసంధర పెరిగిందంటావా లేదంటావా? పైగా, ఇన్నాళ్ళు నేను దీనిని మేపానే! ఇప్పుడు దీనిని తీసుకుపోతానంటావా? అసలు నేను దీనిని అమ్మనే అమ్మనన్నాడు. మావో - సే - టుంగ్ కొంతసేపు ఆలోచించి - "అవును - ఈ పదిరోజులూ నువ్వు దీనిని మేపావు. వెనుకటి ధరకే ఇప్పుడు దీనిని అమ్మడానికి మీరు ఒప్పుకోకపోవడం న్యాయమే" అని చెప్పి, వుత్తచేతుల్తో తిరిగి వచ్చాడు.

♦ ♦ ♦

ఈనాడు ఈ కథలు, షావోషాన్‌చుంగ్ ప్రాంతంలో ప్రతి వారి నోటా వినబడతాయి. మావో-సే-టుంగ్ స్వభావానికి ఇవి ప్రతిబింబాలు! విశ్వాసపాత్రత, నిరాడంబరత్వం, చిత్తశుద్ధి బాల్యంనుండి ఆయన లక్షణాలు.

## చిన్నతనంనుండి విద్యాసక్తి

మావో-సే-టుంగ్ విద్యాభ్యాసం ఎనిమిదవపేట ప్రారంభ మయింది. పదమూడేళ్ళు రావడంతో ప్రైవేటుస్కూలు చదువు పూర్తయింది. ఆ బడుల్లో అప్పుడు బోధిస్తూండిన ప్రాచీనకావ్యాలు విద్యార్థుల పాలిట, పాలపొంగుమీద చన్నీళ్ళు చిలకరించినట్లుండేవి. ఇక బోధనా పద్ధతులా - బట్టీపెట్టడం, వప్పగించడం తప్ప మరేవీ ఉండేదిగాదు. అర్థం, పర్థం ఎవరికీ అక్కరలేకపోయేది. తప్పిజారి, ఏ విద్యార్థియైనా అర్థంకోసం తాపత్రయపడితే, చెప్పగలశక్తి ఏ ఉపాధ్యాయుడికీ ఉండేదికాదు. అర్థం చెప్పేందుకు ఎవరైనా పూనుకొన్నా సగంసగమే చెప్పగలిగేవాడు.

ఈ బట్టీపెట్టే పద్ధతి అంటే మావో - సే - టుంగ్‌కి మొదటి నుంచీ తగని రోత. అంతేకాదు. అర్ధంకాని ఇనప సుగ్గిళ్ళకన్నా, ప్రజాదరంపొందిన "సమ్మిన వీరుడు యు యె ఫీ చరిత్ర" "టాంగ్ రాచవంశపు గాధలు" "పశ్చిమ దేశాల తీర్థయాత్ర" "గాడ్స్ కానూ నైజ్" మరికొద్ది కాలానికి "జలరేఖ" "మూడు రాజ్యాలు" మొదలైన కల్పనిక గ్రంథాలను మావో-సే-టుంగ్ మహాఆసక్తితో చదివేవాడు. ఎంత తృష్ణతో ఈ కల్పనిక గ్రంథాలను చదివేవాడో, అంత శ్రద్ధతోనూ ప్రాచీన కావ్యాలను అధ్యయనం చేసేవాడు. మావో-సే-టుంగ్ జ్ఞాపకశక్తి అద్భుతం. బట్టీపెట్ట నవసరం లేకుండా నే తనకు కావలసిన కావ్యభాగాలన్నీ జ్ఞాపకం ఉండేవి. తను చదివిన నవల్లోని కథావస్తువు, పాత్రలు అన్నీ జ్ఞాపకం ఉండేవి. చదివినదంతా మనసుకు హత్తేలాగా, చాల చిన్నతనంలోనే కథలుగా చెప్పగలిగేవాడు. ఈ విధంగా, ఆసక్తితో చిన్నతనంలో చదివిన వాటి ప్రభావంకూడా మావో-సే-టుంగ్ భవిష్యత్ జీవితంపై గాఢంగా ఉంది.

పదమూడవఏట ప్రైవేటుస్కూలులో చదువు పూర్తిచేసి, మావో-సే-టుంగ్ తిరిగి రైతుజీవితంలో ప్రవేశించాడు. పగలంతా పొలంపనితోను, రాత్రిళ్ళు తండ్రి జమాఖర్చులతోను తీరికలేనిపని ఉండేది. ఇంతఎక్కువపని అలసటకలిగించడం సహజం. అయినా మావో-సే-టుంగ్ గ్రంథపఠనం మానలేదు. చేతికేపుస్తకం దొరికితే అదిచదివేవాడు. జమాఖర్చులపని పూర్తిఅయి అవడంతో పుస్తకం పట్టుకు కూర్చునేవాడు. ఇది తండ్రికి నచ్చేదికాదు. ఇంతకూ ఆ చదువుతున్నదికూడా ప్రాచీన కావ్యాలు కాదాయె! అలాంటిది ఎందుకా దీపం చమురు అలా తగలేయడం అని గొణిగేవాడు. ఈ గొణుగుడు బాధతప్పించు కునేందుకు మావో-సే-టుంగ్ తనగది

కిటికీకి నీలిగుడ్డ ఒకటి కట్టేవాడు. అలా ఆ ఇరుకుగదిలో గుడ్డిదీపం ముందుకూర్చుని, మావో-సే-టుంగ్ అంతులేని జిజ్ఞాసతో అసంఖ్యాక గ్రంథాలను అధ్యయనం చేశాడు.

## రాజకీయ సంఘటనలతో తొలిసంబంధం

చైనాలో భూస్వామ్య (ఫ్యూడల్) సామాజికవ్యవస్థ మూడు వేల సంవత్సరాలనుంచి పాతుకుపోయి ఉంది. అలాంటి ఆ వ్యవస్థ, విదేశీ పెట్టుబడిదారీవిధానం తాకిడికి గురయి, చాల ముఖ్యమైన మార్పులను పొందనారంభించింది. తత్ఫలితంగా చైనాలో అర్ధ భూస్వామ్య వ్యవస్థ అంకురించింది. ఆ విషయమై మావో-సే-టుంగ్ ఇలా రాశాడు.

"...పరాయి పెట్టుబడిదారీ దండయాత్ర ఈ పరిణామాన్ని త్వరితంచేసింది. చైనా సామాజికవ్యవస్థను విచ్ఛిన్నం చేయడంలో పరాయి పెట్టుబడిదారీవిధానం చాల ప్రధానపాత్రను నిర్వహించింది. అవి స్వయంపోషకమైన చైనా జాతీయ ఆర్థికవ్యవస్థను ధ్వంసం చేసింది. పట్టణాల్లోనూ, పల్లెల్లోను కొనసాగుతూ వచ్చిన చేతివృత్తులను రూపుమాపింది. కాని అదేసమయంలో పట్టణాల్లోనూ, పల్లెసీమలోనూ వర్తకసరకుల ఉత్పత్తివిధానాన్ని త్వరగా పెంపొందించింది.

"భూస్వామ్య ఆర్థిక వ్యవస్థ పునాదులను విచ్ఛిన్నం చేయడమే కాకుండా, చైనాలో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం అభివృద్ధి కావడానికి తగిన భౌతిక పరిస్థితులను, అవకాశాలను కూడా ఇవి కలిగించాయి....

"నిజానికి 60 ఏళ్ళక్రితం 19 వ శతాబ్దపు ఉత్తరార్ధంలోనే కొంతమంది వర్తకులు, భూస్వాములు, ప్రభుత్వోద్యోగులు ఆధునిక

పరిశ్రమల్లో పెట్టుబడులు పెట్ట నారంభించారు. ఒకవైపు విదేశీ పెట్టుబడిదారీ విధానం ఇచ్చిన ప్రోత్సాహమూ, మరోవైపు దేశం లోని భూస్వామ్య వ్యవస్థలో గండ్లుపడడమూ ఇందుకు కారణం. నలభై ఏళ్ల క్రితం, ఇరవైయవ శతాబ్దం ప్రారంభదశలో చైనా జాతీయ పెట్టుబడిదారీ విధానానికి బీజం ఏర్పడింది. ("మావో - సే-టుంగ్, చైనా విప్లవము - కమ్యూనిస్టుపార్టీ పాత్ర.")

ఉన్నవారిలో అభ్యుదయవాదులు పెట్టుబడిదారీ సంస్కరణ లకు పూనుకున్నారు. 1898 లో, "ప్రభుత్వాన్ని మార్చి ఆధునిక యుగాన్ని ప్రారంభించాలి" అన్న ఉద్యమం ప్రారంభమయిననాటికి మావో-సే-టుంగ్ ఆరేళ్ళ పసివాడు. ఆ ఉద్యమ ఫలితంగా ఏర్పడిన ప్రభుత్వం ఒక్క వందరోజులు మాత్రమే నిలిచి, విఫలమయింది.

ఈసంస్కరణవాదుల్లో ఒక ప్రముఖుడు చెంగ్-కువాన్-యింగ్. 1894 చైనా జపాను యుద్ధానికి పూర్వం ఆయన "మోనిషన్ ఇన్ ఏ ప్రోస్పరస్ ఏజ్" అని ఒక గ్రంథం రచించి, ప్రచురించాడు. ఆ పుస్తక మొకటి మావో-సే టుంగ్ కి చిక్కింది. పార్లమెంటరీ విధానం, చట్టబద్ధమైన రాచరిక పాలనలు ప్రాతిపదికగా, సమగ్ర మైన సంస్కరణలను రచయిత ఆ పుస్తకంలో ప్రతిపాదించాడు. చైనా - జపాను యుద్ధానంతరం ప్రారంభమైన సంస్కరణ ఉద్యమం మీద ఈ పుస్తకం ప్రభావమూ, తక్కిన అభ్యుదయవాదుల అభి ప్రాయాల ప్రభావమూ ఎంతగానో ఉంది. చైనా దౌర్బల్యానికి కారణం పరిశ్రమల్లో అది వెనుకబడి ఉండడమే అనీ, ఈ వెనుకబడి ఉండడానికి ఆధునిక యంత్రాలు లేకపోవడం కారణమనీ ఈ అభ్యు దయ వాదులంతా ఏకాభిప్రాయానికి వచ్చారు. కాబట్టి చైనాలో రైల్వేల నిర్మాణం, నౌకా, టెలిగ్రాఫ్, టెలిఫోను వగైరాల

ఇదంతా చదివి మావో-సే-టుంగ్ పరవశుడయ్యాడు. తానదివరకే చదివిన గ్రంథాలూ ప్రాచీన కావ్యాలకన్న, ఎంతో అధికంగా కార్యాచరణకు తోడ్పడగల పుస్తకం ఇన్నాళ్లకు దొరికిందని ఆనందం పొందాడు. ఆయన విజ్ఞానాకాంక్షను అది మరింత ఇనుమడింపజేసింది. ఇంట్లోంచి బయలుదేరి వెళ్ళాడు. మొదట ఒక న్యాయశాస్త్ర విద్యార్థికింద ఆరుమాసాలు అధ్యయనం చేశాడు. మావో, లు-చాంగ్ అనే పాతరకపు పండితునివద్ద మరికొన్ని కావ్యాలు పఠించాడు. అది అలా ఉన్నప్పటికీ తనంతట తానే అనేక నవరచనలను సేకరించి అంతులేని ఆసక్తితో పఠించేవాడు; ఆనాటి దైనందిన సంఘటనలపై కనబడ్డ వ్యాసాన్నల్లా క్షుణ్ణంగాచదివేవాడు.

## పీడిత ప్రజలయెడల, పేద రైతులపట్ల చిన్నతనంనుంచి సానుభూతి

వీటిని చదవడం ప్రారంభించినంత మాత్రాన మావో-సే-టుంగ్, ప్రాచీన నవలాసాహిత్యాన్ని విసర్జించలేదు. ముఖ్యంగా, పాలకవర్గాలపై తిరుగుబాటులను చిత్రించే నవలలను ఎంతో ఆప్యాయంగా చదివేవాడు.

అలా చదువుతుంటె ఒకనాడు హటాత్తుగా ఆయన కొక ప్రశ్నతట్టింది: తాను చదివిన నవల లన్నింటిలోనూ రాజులు, సేనాధిపతులు, మంత్రులు, సన్యాసులు - వీరికే ప్రాధాన్యత అంతాను. అంతేగాని, ఎవరిజీవితాన్ని తాను ఆమూలాగ్రంఎరుగునో, ఆ రైతులకు వాటిలో స్థానమే ఉండెదికాదు. దీనికి కారణమేమిటి? అన్నప్రశ్న ఉన్నట్టుండి ఆయన మనసులో ఉదయించింది. ఎంతో

దొరికింది. ఆ నవలలోని కథానాయకులంతా పాలకులు, ప్రజా పీడకులు, దోపిడీదారులే. విశాలమైన భూములు వారిసొత్తు. ఎన్నడూ అరకపట్టి ఎరుగని ఆకథానాయకులు, రైతులను కూలీఇచ్చి నానాచాకిరీ చేయించుకొనేవారు.

ముఖ్యమైన ప్రశ్న-సమాధానం కూడా అంతప్రధానమైనవే. ప్రాచీన రచనల్ని చదివే లక్షోప లక్షల పాఠకులలో ఇలాంటి ప్రశ్న తట్టేది ఎందరికి? దానినిగురించి ఆలోచించేది ఎంతమంది? మావో-సే-టుంగ్ ఆ సమస్యను తీసుకున్నాడు; సమాధానం కోసం కృషి చేశాడు. శ్రామిక జనసామాన్యం అంటే ఆయనకున్న శ్రద్ధ కపొక నిదర్శనం. అంతేకాదు. ఇతరులు అంతగా పట్టించుకోని విషయాలను గురించి సమస్యలను గురించి స్వతశ్శక్తితో ఆలోచించే పట్టుదల ఆయనకు చిన్నతనంనుంచి ఉండేదనేందుకు ఇదొక ఉదాహరణ.

పరాయి దురాక్రమణ పెరిగినకొద్దీ, చైనా ప్రజల రాజకీయ చైతన్యం స్థాయికూడా పెరుగుతూ వచ్చింది. పరాయి దోపిడీదారులకు, అవినీతితో నిండి, మైనారిటీ జాతులనే కాకుండా హాన్ ప్రజలనుకూడా నానా హింసల పాల్జేసిన మంచూ చక్రవర్తుల భూస్వామ్య పాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటాలెన్నో సాగాయి. ఈ పోరాటాల్లోకల్లా మహత్తరమైన తాయ్‌పింగ్ విప్లవం 1850 లో- అంటే మావో-సే-టుంగ్ పుట్టుకకు 43 ఏళ్ళపూర్వం-ప్రజ్వరిల్లింది. ఆ విప్లవ ప్రాభవం పదిహేనేళ్ళు నిలిచింది. చివరకది నీళ్లు గారిపోయినా, చైనా ప్రజల చరిత్రపై దాని ప్రభావం ఇంతంతకాదు.

మావో-సే-టుంగ్ తాత తరానికి చెందిన ముదుసలులు, ఈ విప్లవ ఘటనలను ఎంతో ఆప్యాయంగా, కథలుగా చెప్పుకోవటం సర్వ సాధారణం. ముఖ్యంగా విద్రోహి, హంతకుడు అయిన

శ్నేంగ్-క్వో-ఫాన్ కుతంత్రాలఫలితంగానే ఆనుహూ విప్లవం అణగారి పోయింది. హూనాన్ రాష్ట్రంలోని సియాంగ్ సియాంగ్‌కు చెందిన ఆ ద్రోహి, విప్లవాన్ని దెబ్బ తీసేందుకు సియాంగ్ (హునాన్) సైన్యాన్ని తయారు చేశాడు. తన సోదర ప్రజల్ని అసంఖ్యాకంగా ఊచకోత కోశాడు. హునాన్ రాష్ట్ర ప్రజల మనసుల్లో ఈ దురంతం బాగా హత్తుకుపోయింది.

తాయ్‌పింగ్ విప్లవం అణగారిపోయింది. కాని, చైనా రైతు ప్రజానీకం తమ ప్రతిఘటన పోరాటాలను పూర్తిగా విసర్జించలేను. ప్రకృతి ఉత్పాతాలు, మానవ కల్పిత ఉపద్రవాలూ ఎన్ని విరుచుకు పడినా, తమ పోరాటాలు సాగిస్తూనే వచ్చారు.

ఒకసారి భయంకరమైన కరువు పరిస్థితు లేర్పడ్డాయి. మావో-సే-టుంగ్, మరి కొంతమంది కుర్రవాళ్ళు కలిసి స్కూలు బయట ఆడుకుంటున్నారు. చాలమంది బియ్యపు వర్తకులు గుంపుగా రావడం చూచారు. ఛాంగ్షా నగరంవారిలాగా కనుపించారు ఆ వర్తకులు. అంత పెద్ద పట్నం వదలిపెట్టి ఎందుకు వచ్చేస్తున్నారని ఆ కుర్రవాళ్ళు అడిగారు. అక్కడంతా అల్లకల్లోలంగా ఉంది కాబట్టి పారిపోయి వచ్చామని వర్తకులు చెప్పారు.

వేలకొలది చాంగ్షా ప్రజలు కరువురాకాసికి బలిఅయ్యారు. ఆ బాధలనుభరించలేక అన్నాతురులు తమనుఆదుకోవలసినదని అరిస్తూ గవర్నరునద్దకు ఒక ప్రతినిధిని పంపారు. "తిండిలేకపోవడమేమిటి? ఊళ్ళో కావలసినంత ధాన్యం ఉంది. నన్ను చూడండి. తిండికి నా కెప్పుడూ లోటులేద"ని గవర్నరు హేళనగా జవాబుచెప్పాడు. ఈ జవాబుతో ఆకలిబాధితులు మండిపోయారు. గవర్నరుకోటమీద ఒక గుంపు విరుచుకుపడింది. జెండాకొయ్యను తెగనరికి గవర్నరుని వెంటనే తరిమారు. ఇంతలో చువాంగ్-కెంగ్-లియాంగ్ అనే ఒక ఉన్నతో

డ్యోగి గుర్రంమీద పరుగెత్తుకొనివచ్చి వెంటనే తగిన సహాయాన్ని ఏర్పాటుచేస్తామని చెప్పి, ప్రజల్ని శాంతపరిచాడు. దానితో ప్రజలు ఎవరిదారిని వారు పోయారు. ఇదితెలిసి, మంచూ చక్రవర్తి ప్రజలకు సహాయాన్ని మంజూరుచేయడానికి బదులు దొమ్మీదారులతో కలిశాడని ఆరోపించి చువాంగ్‌ని పనిలోనుంచి తీసివేశాడు. చాంగ్షాకు ఒక కొత్తగవర్నరుని పంపాడు. అతను వచ్చీరావడంతో దొమ్మీకి నాయకులనుకొన్న వారినంతా బంధించి చాలామంది తలలు నరికించాడు.

వర్తకులు చెప్పిన ఈ ఘటనలన్నీ విని, ఆ కుర్రవాళ్లు వాటిని గురించి చర్చించసాగారు. చాలమంది దొమ్మీదారులపట్ల సానుభూతి తెలిపారు. కాని మాటవరసకు ఏదో కుతూహలంకొద్దీ తెలిపిన సానుభూతే వారిది. మావో-సే-టుంగ్ మాత్రం ఆ ఘటనలన్నీ విని ఎంతో ఆవేదనపొందాడు. భవిష్యత్ నవచైనా నేత ఆ చిరుప్రాయంలోనే దొమ్మీదారుల ఆశయంతో ఏకీభవించాడు. వారు తన గ్రామంలోని ఇరుగుప్రజల్లాగానే నిజాయితీపరులని గ్రహించగలిగాడు. ఆకలితోమాడి దిక్కుమాలిన కుక్కచావు చావడానికి ఇష్టపడని సామాన్యమానవులే వారని, ఆ లేతవయసు లోనే ఆయన అర్థంచేసుకున్నాడు. ఈ ప్రజాసామాన్యపు చావు బ్రతుకులపట్ల పాలకుల కర్కశ ఉపేక్షాభావాన్ని తీవ్రంగా ఖండించాడు. తన భావిజీవితంపై ఈ సంఘటన ప్రభావం ఎంతపడిందో ఆయనే తరువాత ఒకసారి స్వయంగా వివరించాడు.

హారొకవారి వాళ్ళ గ్రామంలో స్థానిక కి-లానో-హుయ్ (రహస్య రైతుసంఘం) సభ్యునికొకనికి ఒక భూస్వామితో తగాదా వచ్చింది. అతనిమీద భూస్వామి కేసుపెట్టాడు. డబ్బు, అధికారం ఉన్న భూస్వామికేసులో గెలిచాడని వేరే చెప్పనక్కరలేదు.

ఆ కేసులో జరిగిన అన్యాయానికి అసమ్మతి తెలుపుతూ కి-లావో-హుయ్ సభ్యులందరూ కొండల్లోకిపోయి ప్రతిఘటన పోరాటానికి సన్నద్ధు లయారు. వెంటనే ప్రభుత్వం వారిమీదికి తన సేనలను నడిపింది. కి-లావో-హుయ్ సభ్యులు సాయుధ తిరుగుబాటుకి సిద్ధంగా ఉన్నారని తమ ఆచారం ప్రకారం ఒక శిశువును చంపి, తమ పతాకకు బలి యిచ్చారనీ, కేసులో గెలిచిన భూస్వామి నానా దుష్ప్రచారము సాగించాడు. ప్రభుత్వం ఆ "తిరుగుబాటు"ను దారుణంగా అణచింది. దానికి నాయకత్వం వహించిన ఒక కమ్మరి మొదట తప్పించుకొన్నాడు. కాని, తరువాత పట్టుబడి శిరచ్ఛేదనకే గురిఅయాడు. మావో-సే-టుంగ్‌కి ఆతని బాలబృందానికి ఈ రైతు పోరాటం పట్ల ఎంతో భక్తిభావం ఏర్పడింది. దానికి నాయకత్వం వహించిన కమ్మరి, వారి హృదయాల్లో ఒక అమరవీరుడై వెలిశాడు.

ఆ మరుసటి సంవత్సరమే కోతలింకా కొద్దిరోజుల్లో ఉన్న వనగా, తిండిగింజలకు ఎక్కడలేని కరువువచ్చి పడింది. బీదా, బిక్కీ గుక్కెడు గంజికే కటకటలాడిపోయారు. అదివరకే గాదెలునింపుకున్న ధనికులు, చుక్కలనంటే ధరలకుతప్ప బియ్యం ఇవ్వం పొమ్మన్నారు. సరే "కలిగినోళ్ళింట్లోనే విస్తరివేద్దా"మనే ఉద్యమాన్ని పేద ప్రజానీకం ప్రారంభించింది. వందలకొలది అన్నార్తులు - స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు - ధనికుల ఇళ్ళల్లో జొరబడడం, వాళ్ళగాదెలు గుమ్మరించి, అక్కడేదంచి శుభ్రంచేసి, వాళ్ళ వంట పాత్రల్లోనే వండి, అక్కడే పంక్తులుకూర్చొని తృప్తిగాతిని వెళ్ళడం ప్రారంభించారు.

ఈఘటనలన్నీ మావో-సే-టుంగ్ లేతమనసులో ప్రగాఢ సంచలనం కలిగించాయి. రైతుల కష్టనిష్ఠూరాలపట్ల ఆయన సానుతాపం నానాటికి పెరిగింది. అనాటి ప్రజాఉద్యమాలపట్ల పూర్తి

సానుభూతి చూపడమేకాదు; అవి ఎంతటి మహత్తరశక్తి పుంజములో ఆయన అవగాహన చేసుకోగలిగాడు. అంతేకాదు. పాలక వర్గాలకు వ్యతిరేకంగా ప్రజాసామాన్యాన్ని మోసగించేందుకు వాళ్లు బోధించే మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు లేవదీయాలనే ఊహలుకూడా ఆయనలో అంకురింపసాగాయి. పాలిత, పీడిత వర్గమైన రైతుప్రజానీకానికే ఆయన మొదటినుండీ తన హృదయపూర్వక సానుభూతిని అర్పించాడు.

## మనోబలం

మావో-సే-టుంగ్ తండ్రి, పాన్ - షెంగ్ ఇంటిలో చాల నిరంకుశంగా ఉండేవాడు. తరుచుగా ఏలాంటి కారణం లేకుండా, తన కొడుకులమీద, సోమరిపోతులనీ, భయభక్తి లేనివారనీ విరుచుకుపడేవాడు. మావో-సే - టుంగ్ ఇది సహించేవాడుకాదు. తరుచు ఎదురుతిరిగేవాడు. తన హక్కుల రక్షణకోసం ఇలా నిర్భయంగా ఎదురుతిరిగినప్పుడల్లా తండ్రి దిగిరావడం అనుభవంమీద గమనించాడు. అలా కాకుండా, ఆ నిరంకుశత్వానికి, పిరికితనంతో తలొగ్గితే, చీవాట్లు చెప్పుదెబ్బలు మరింత జోరుకావడం తప్ప మరో ఫలితమేమీ లేకపోవడంకూడా చూచాడు. కాబట్టి "ఆత్మరక్షణకు పోరాటమే ఉత్తమ మార్గమ"ని నిర్ణయించుకున్నాడు.

తన తొమ్మిదవఏట ఈసూత్రాన్ని మొట్టమొదట ఆచరణలో పెట్టి చూచాడు. అప్పుడాయన స్థానిక ప్రైవేటుస్కూలు విద్యార్థి కాని, ప్రొద్దుటా, సాయంత్రమూ పొలంపని ఉండేది. పాతకాలపు ప్రైవేటు పాఠశాల పంతుళ్లకు పిల్లల్ని చితకగొట్టడం అంటే మహా సరదా. పిల్లలకు చదువుచెప్పడం విషయంలో ఆనాటి తలిదండ్రులకు, బడిపంతుళ్ళకూ "దండం దశగుణంభవేత్" అనేది

అభిమాన సూత్రం. మావో - సే - టుంగ్ బడిపంతులు కూడా ఆ వరవడివాడే. పిల్లల "బాగు"కు ఆయన అనుసరించే పద్ధతు లనేకం. కొరడాతో కొట్టడం, అరిచేతులమీదా, తలమీదా, అరిపాదాలమీదా-బాదడం, తొడపాశం పెట్టడం, కొన్ని పద్ధతులు. వీటన్నిటిని మించిన పద్ధతి ఒకటుండేది. కత్తుల్లాంటి నిలువుచెక్కలు తాపిన ఒక పలకమీదగాని, సూదుల్లాంటి కంకర పరచిన నేలమీద గాని ఒక పెద్ద ఊదువత్తి పూర్తిగా కాలిపోయేవరకు మోకాళ్ళ మీదకూర్చొని ఉండాలి.

ఈ శిక్షలను మావో-సే-టుంగ్ ప్రతిఘటించాడు. మొదటి సారి 'సత్యాగ్రహపద్ధతి' ననుసరించి, స్కూల్లోంచి పారిపోయాడు. కొండదిగి, ఎటో ఒక ఊహాకల్పిత నగరంవైపు ప్రయాణం సాగిం చాడు. అలా మూడురోజులు ప్రయాణం సాగించిన తరువాత, తాను తన ఇంటికి మూడున్నర మైళ్ళకన్నా ఎక్కువదూరం పోలే దనీ, ఇన్నాళ్ళూ తాను చేసింది అక్కడి లోయచుట్టూ ప్రదక్షిణం మాత్రమేననీ మావో-సే-టుంగ్ తెలుసుకున్నాడు. అంతలోనే తలితండ్రులు అతనిని పట్టుకుని ఇంటికి తీసుకుపోయారు.

ఇంటికి చేరగానే, తన తండ్రి మునుపటిలాగా రుసరుస లాడకుండా శాంతంగా ఉండడమూ, తన బడిపంతులులో కూడా మునుపటి కర్కశత్వం లేకపోవడమూ మావో-సే-టుంగ్ గమనిం చాడు. ఈ ప్రతిఘటన ఫలితం ఆ లేతహృదయంలో బాగా నాటుక పోయింది. తరువాత ఆ విషయంగురించి చెబుతూ, ఆయనొక కొత్త మాటను ఉపయోగించి అదొక జయప్రదమైన సమ్మెఅని అన్నాడు.

షున్-షెంగ్ కష్టపడి పనిచేసి కుటుంబాన్ని పోషిస్తూ వచ్చాడు. మావో-సే-టుంగ్ కూడా చిన్నప్పట్నుంచీ నడుంవంచి పనిచేసినవాడే. కాని, ధాన్యం వ్యాపారంలో డబ్బు సంపాదన

విషయంలోనూ, కరువురోజుల్లో ధాన్యం అమ్మవలసిన ధరల విష యంలోనూ తండ్రీకొడుకులవి పూర్తిగా విభిన్న దృక్పథాలు. ఈ భిన్నాభిప్రాయాల ఫలితంగా వారిద్దరికీ ఘర్షణ నానాటికీ పెరుగుతూ వచ్చింది. ఇతరుల పొట్టగొట్టి సంపాదించే అన్యాయార్జితాన్ని ఆనాటి చైనాసమాజం హర్షించేది. కాని, మావో-సే-టుంగ్‌కి అది మహా రోత పుట్టించేది.

తండ్రి నిరంకుశత్వాన్ని ప్రతిఘటించ బూనుకున్న మావో-సే-టుంగ్‌కి, చిరకాలంనుంచి ఆ నిరంకుశత్వానికి గురయి, బాధలను మోసుకు బ్రతుకుతూన్న తనతల్లిపట్ల సానుభూతి పెరగడం సహ జమే. తండ్రి కుటుంబాన్ని నడుపుతూన్న పద్ధతులు తల్లికి నచ్చేవి కావు. కాని ఆమె ఏనాడూ తనవ్యతిరేకతను బయటపెట్టి ఎరుగదు. అప్పుడప్పుడు, వారుసహింపరాని పరిస్థితు లేర్పడినప్పుడు ఒక చిన్న మాట విసరడమో, లేక మూతిముడుచుకు కూర్చోవడమో తప్ప మరేమీ అని ఎరుగదు.

ఆమె దీనావస్థనుచూచి మావో-సే-టుంగ్‌కు మతిపోయేది. భార్యాభర్తలమధ్య స్పష్టంగా కనబడుతున్న హెచ్చుతగ్గులను ఆయన సహించలేకపోయాడు. భూస్వామ్య పితృసమాజంలోని ఈ పీడనా స్వభావాన్ని పూర్తిగ నిర్మూలించేందుకు ఆయన సాగిం చిన నిర్విరామ పోరాటానికి బీజం ఆనాడేపడింది. భూస్వామ్యం, పితృసమాజం అనే మాటలు అప్పటికింకా ఆయనకు తెలియవు. అయినా, కర్కశ, నియంతృత్వవాది అయిన తన తండ్రికి వ్యతిరే కంగా తనతల్లిని, తమ్ముడిని, జీతగాడిని కలుపుకొని 'ఐక్యసంఘటన'ను నిర్మించేందుకు కావలసిన పరిజ్ఞానం ఆయన అనుభవంమీద సంపా దించుకున్నాడు. ఇంతచేస్తున్నపటికీ, తనవంతు పనిని పూర్తిగా చేయడం ఆయన తండ్రి పద్దులనుచక్కగా ఉంచటం ఎప్పుడూ మాన

లేదు. తననుదూషించేందుకు తండ్రికి ఎప్పుడూ ఏలాంటి అవకాశం దొరకకుండా చేయడమే ఆయన ఉద్దేశం.

## దేశరక్షణకై స్థిరసంకల్పం

సామ్రాజ్యవాద దేశాల దురాక్రమణతత్వం పెచ్చు పెరగడంతో, అంతర్జాతీయంగా చైనా పరిస్థితి మరింత నికృష్టమైంది. అయినప్పటికీ పరాయి సామ్రాజ్యవాదానికి, స్థానిక భూస్వామ్య పీడనకు వ్యతిరేకంగా ప్రజలు తమ పోరాటాలను మానలేదు. 1900 సంవత్సరంలో ఐ-హూ-టువాన్ అనబడే బాక్సర్ ఉద్యమం ప్రారంభమయింది. మావో-సేటుంగ్‌కి అప్పటికే ఏడేళ్ళు. పరాయి దురాక్రమణదారులకు, మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రారంభమయిన ఉద్యమం అది. "మంచూ ప్రభుత్వాన్ని కూలద్రోసి మింగ్ వంశపు ప్రభుత్వాన్ని స్థాపించాలి" అన్నది దాని ముఖ్య నినాదం. మంచూ ప్రభుత్వం పరిస్థితులను చక్కగా ఉపయోగించుకొని "పరాయి సామ్రాజ్యవాదులను హతమార్చేందుకు మంచూ ప్రభుత్వాన్ని బలపర్చాలి" అనే నినాదాన్ని ప్రచారం చేయించింది. చివరకు ఆ మంచూ ప్రభుత్వమూ, పరాయి సామ్రాజ్యవాదులు ఏకమై ఆ ఉద్యమాన్ని క్రూరంగా అణచివేశారు; అందులో పాల్గొన్న వారిని ఊచకోత కోశారు. ఎనిమిది విదేశాల సేనలు పెకింగునగరం మీదపడి కొల్లగొట్టాయి. "పెకింగ్ సంధి" అనే పేరుతో 1901లో నీచమైన మరొక బానిస ఒడంబడికను చైనా మెడకు చుట్టారు.

1894 లో చైనా జపాను యుద్ధం ప్రారంభమైన రోజుల్లోనే చైనాను ముక్కచెక్కలు చేసి పంచుకోవాలనే ఉద్దేశం పరాయి సామ్రాజ్యవాద ప్రభుత్వాలకు ఉండేది. ఏది దొరికితే అది చదవాలనే తృష్ణ ఏమాత్రం సన్నగిలని మావో-సే-టుంగ్‌కు ఆ తరువాత

కొద్ది సంవత్సరాలకే "పరాయి ప్రభుత్వాలు చైనాను ఛిన్నాభిన్నం చేసే ప్రమాదం" అన్న పుస్తకం ఒకటి దొరికింది. కొరియా, తాయ్‌వాన్, (ఫార్మోజా)లను జపాను ఆక్రమించుకోవడం గురించి రచయిత విపులంగా రాశాడు. ("అయ్యయ్యో! మన మాతృదేశం చైనా సర్వనాశనమయే ప్రమాదాన్ని ఎదుర్కొంటూంది!" అంటూ ఆ చిన్నపుస్తకంలో ఉద్వేగం కలిగించే తొలిపంక్తి మావో-సే-టుంగ్‌కి యీనాటికీ స్పష్టంగా జ్ఞాపకం ఉంది).

ఆ పుస్తకం చదివిన తరువాత మావో-సే-టుంగ్‌కి తన మాతృదేశం యొక్క దుస్థితి కరతలామలకం అయింది. అంతులేని ఆవేదన పొందాడు. తన మాతృదేశ సంరక్షణే తన జీవితపరమావధి అని ఆ క్షణంలోనే దీక్ష బూనాడు. అదే చైనా పౌరుని పవిత్ర ధర్మమని నిశ్చయించుకున్నాడు. చైనాదేశానికి, ప్రజలకు, విముక్తి చేకూర్చడమనే సమస్యపైనే అప్పటినుంచి ఆయన తన దృష్టినంతా కేంద్రీకరించాడు. ఆ సమస్యా పరిశీలనకు, పరిష్కారమార్గాల అన్వేషణకు నాటినుండి ఆయన తన పటుతర మేధశ్శక్తి నంతటినీ వినియోగించాడు.

ఒకవైపు పవిత్రమైన ఈ దీక్ష; మరోవైపు అంతులేని విజ్ఞానతృష్ణ. ఇక నతను, పట్నంలో ఒక బియ్యంకొట్టులో గుమస్తాగిరి తరిఫీదు పొందమని తండ్రి ఇచ్చిన సలహాను ఎలా అంగీకరించగలడు? దానిని నిరాకరించి, చదువును కొనసాగించడంకోసం సియాంగ్ సియాంగ్ నగరానికి బయలుదేరాడు. అక్కడొక "విదేశీపద్ధతి పాఠశాల"లో చేరాడు.

అప్పటికి మావో-సే-టుంగ్ వయసు పదహారేళ్ళు. స్వగ్రామం షావోషాన్‌చాంగ్ వదలివెళ్ళడం అదేమొదటిసారి. తన బట్టలు, మొదలైనవన్నీ ఒక చిన్న మూటగ కట్టి, భుజానతగిలించుకొని,

షుమారు 17 మైళ్ళ దూరంలో, టుంగ్‌టాయ్‌షాన్ కొండదిగువ నున్న సియాంగ్ సియాంగ్ నగరానికి ప్రయాణమై పోయాడు. 'నవవిద్యా' సముపార్జనకు దీక్షతో సాగిపోయాడు.

వాంగ్‌చాన్ గేటులోనుంచి, సియాంగ్ సియాంగ్‌నగరం వెలుపలికిపోయి, అక్కడున్న రాతి సోపానాలను దిగిపోతే వీన్-షుయ్ అనే నది కనబడుతుంది. అవతలియొడ్డుకు పోయేందుకు పడవ లున్నాయి. అవతలిఒడ్డున, కొంచెందూరం ముందుకుపోతే కుడివైపున టుంగ్-టాయ్ షాన్ పర్వతపు మనోహరదృశ్యం కనబడుతుంది. ఆ పర్వత పాదానికి అనతిదూరంలో టుంగాన్‌సింగ్ అనే ప్రాంతం ఉంది. అక్కడ వలయాకారంలో ఎత్తైన ప్రహరీగోడ; దానికి ముందూ, వెనుకా దృఢమైన ద్వారాలు; ఆమధ్య అన్నివసతులతో కూడుకొన్న ఒక చక్కనిభవనం. వెనుకటిరోజుల్లో అది టుంగ్‌షాన్ పరిషత్తు. ఇప్పుడు దానికి సియాంగ్ సియాంగ్ నగరపు టుంగ్‌షాన్ ఉన్నత ప్రాథమిక పాఠశాల అని పేరు మార్చారు.

సాయంత్రవేళల్లో టుంగ్‌టాయ్‌షాన్ పర్వతశిఖరం, ఏడంతస్థుల తెల్లని దేవాలయాల ప్రతిబింబాలు, పాఠశాల సమీపంలోని కొలనులో ముచ్చటగా కనుపిస్తాయి. మావో-సే-టుంగ్, అతని మిత్రులు, సాయంత్రంపూట అక్కడే పచార్లు తిరిగేవారు. అక్కడి రాతివంతెన గట్లపై ఆనుకొని, కిందకొలనులోని చేపల ముచ్చట్లను తిలకిస్తూ, వారు ఏవో చర్చలు జరుపుకొనేవారు. ఆ ప్రక్కనేఉన్న క్రీడారంగంలో తక్కిన విద్యార్థులు, పాటలు రక రకాల ఆటలలో మునిగి తేలుతుండేవారు.

పాఠశాలలో చేరిన కొద్దిరోజుల్లోనే మావో - సే - టుంగ్ సోదర విద్యార్థులు మొదలైనవారి దృష్టి నాకర్షించాడు. పఠన మందిరాల్లోంచీ, తరగతుల్లోంచి, విద్యార్థి వసతు గృహాల్లోంచి

ఆయన వచ్చి పోతూంటే, అంతా శ్రద్ధతో చూచేవారు. ముఖంలో తెలివితేటలు, కళ్ళల్లో స్నేహభావం ఉట్టిపడుతుండేవి. బక్క-పల్చని ఆకారం; నిరాడంబరమైన నీలి దుస్తులు. అతనితోడి విద్యార్థుల్లో ఎక్కువమంది భూస్వాముల కుటుంబాలకు చెందినవారే. వాళ్ళందరూ చాల ఆడంబరంగా ముస్తాబయేవారు. నిడుపాటి గౌనులు, నడుముకి రంగురంగుల పట్టీ; ఆ పట్టీని సగంవరకే కప్పే ముతకరంగు చొక్కా; ఈ ఉడుపుల రంగుకు జతపడే చంకీజోళ్లూ - ఇలా ఉండేది వాళ్ళ ముస్తాబు. మరికొందరు షోకైన విద్యార్థి యూని ఫారాలు ధరించేవారు. కాని, మావో - సే - టుంగ్‌కి ఉన్నదంతా ఇంట్లో నేసికుట్టిన ఆ ఒక్క జతబట్టలే. ఆయన ఉచ్చారణకూడా సియాంగ్ సియాంగ్ ప్రాంతపు ఉచ్చారణకు చాల భిన్నంగా ఉండేది. ఎవరైనా అడుగుతే, తాను సియాంగ్ టాన్ ప్రాంతపు వాడిని కాబట్టి అలా ఉందనేవాడు. కాని, తనతల్లి సియాంగ్ సియాంగ్ ప్రాంతపు మనిషే. అనికూడా తెలిపేవాడు. తనతల్లి తరఫు చుట్టంకూడా ఒకతను అప్పుడా పాఠశాలలో ఉండేవారు. మావో-సే-టుంగ్‌కన్నా ఆ వెన్ కుటుంబం కుర్రవాడు ఒక ఏడాది ముందు చేరాడు. అతనంటే చాలమంది విద్యార్థులకు తెలుసు.

కొద్దిమంది మంచి విద్యార్థాలుతో పరిచయం ఏర్పడినప్పటికీ, మావో-సే-టుంగ్‌కి, కొంతకాలంవరకు వంటరితనంగా ఉండేది. మావో స్నేహితులంతా బీదకుటుంబాలకు చెందినవారే. అతుకుల బొంతల్లాంటి దుస్తులు తప్ప వారికి మరేమీ ఉండేదికాదు. కాని, కష్టపడి చదివి, పైకిరావాలనే దీక్ష వారిలో అనుక్షణం కనబడేది. వారిఉచ్చారణ మావో-సే-టుంగ్‌ది ఒకలాగానే ఉండేది. ఉదాహరణకు 'నేను' అనేమాటకు సియాంగ్‌సియాంగ్ ప్రాంతంవారు 'న్ గా' అని అంటారు. మావో-సే-టుంగ్, అతనిమిత్రులు 'వో' అనేవారు.

ఎప్పుడూ నెమ్మదిగా మాట్లాడడం మావో-సే-టుంగ్ అలవాటు. ఆయన నిర్మోహమాటి, నిరాడంబరి. పాఠశాలలో అతిత్వరగా ఆయన ప్రథమశ్రేణి నందుకున్నాడు. దానితో ఉపాధ్యాయులందరికి ఆయనంటే ఎంతో అభిమానం ఏర్పడింది. ముఖ్యంగా ప్రాచీనకావ్యాల అధ్యాపకునికి, చైనా భాషాబోధకునికి, ఆయన ప్రియశిష్యుడయాడు. మొదటినుంచీ ప్రాచీన కావ్యాలను క్షుణ్ణంగా చదివినందువల్ల, మావో-సే-టుంగ్ ప్రాచీనశైలిలో వ్యాసాలు రాయడంలో మంచి నైపుణ్యం కనబరిచేవాడు. ఇందుకు ఇద్దరు ఉపాధ్యాయులు ఎంతో మురిసిపోయేవారు.

ప్రతిరోజూ, ఉదయం హాజరుపట్టీ చదివేటప్పుడు, ఉపాధ్యాయుడు చిన్న ఉపన్యాసం జేయడం ఆ రోజుల్లో ఆచారం. చైనా పతనావస్థను గురించీ, పరాయి సామ్రాజ్యవాదుల అఘాయిత్యాలను గురించి తరుచు ఉద్వేగంతో ప్రసంగించేవారు. ఈ ప్రసంగాలు విద్యార్థుల యువ హృదయాల్లో ఆగ్రహావేశాలను రగుల్కొలిపేవి. ఉపాధ్యాయుల్లో కొంతమంది అప్పుడే జపాను నుంచి తిరిగివచ్చినవారు. మెయ్‌జి సంస్కరణల (1868) ఫలితంగా జపాను ఎలా ఒక బలమైన దేశంగా రూపొందినదీ, ఇంకా అనేక పరాయిదేశాలు చైనాను కబళించేందుకు ఎలా కుట్రలు పన్నుతున్నదీ మావో-సే-టుంగ్ ఆ ఉపాధ్యాయులనుండి తెలుసుకున్నాడు. దీని ఫలితంగా, చైనా భవిష్యత్తుపట్ల ఆయన శ్రద్ధాసక్తులు ఇనుమడించాయి.

తనంతటతానే తనకు కావలసినవన్నీ చదువుకొని అర్థం చేసుకొనే వెనుకటి పద్ధతినే మావో - సే - టుంగ్ టుంగ్‌షాన్ పాఠశాలలో కూడా కొనసాగించాడు. చైనా చరిత్ర ఆయన అభిమాన విషయం. అయినప్పటికీ ఇతర దేశాల చరిత్రలను గురించీ,

భౌగోళికాది విషయాలను గురించీ కుతూహలంతో చదివేవాడు. ఒకసారి ఒక మిత్రుడు ఆయనకు రెండు పుస్తకాలు బహుమతి ఇచ్చాడు. ఒక పుస్తకం కాంగ్-యు-వీ ప్రారంభించిన సంస్కరణ ఉద్యమం (1898) గురించినది. రెండవది "నూతన ప్రజా విజ్ఞాన సర్వస్వం." దీని సంపాదకుడు లియాంగ్-చి-చావో. ఈ రెండిటినీ మావో - సే - టుంగ్ ఎన్నిసార్లు చదివాడో లెక్కలేదు. వాటిని ఇంచుమించు కంఠస్థం చేశాడు. కాంగ్, లియాంగ్ లిద్దరూ చైనా సంరక్షణే ప్రధాన సమస్యగా తీసుకోవడంవల్ల ఆ రోజుల్లో వాళ్ళిద్దరూ మావో-సే-టుంగ్‌కి ఆదర్శప్రాయులయారు. దానికి తోడు, చక్కని, గంభీరమైన శైలి లియాంగ్ సొత్తు.

ఒకనాడు సాయంత్రం ఆటవిడుపు పూర్తిఅయింది. గంట కొట్టగానే ఆడుతూ పాడుతూన్న విద్యార్థులంతా బోధనా మందిరం లోకి వస్తున్నారు. మావో-సే-టుంగ్ ప్రక్కను ఒక కుర్రవాడొక పుస్తకం పట్టుకొని వస్తున్నాడు.

"అదేం పుస్తకం?" అని మావో - సే - టుంగ్, ఎంతో నెమ్మదిగా అడిగాడు.

"ప్రపంచవీరులు మహాపురుషులు," అని ఆ కుర్రవాడన్నాడు.

"నేనొకసారి చదవవచ్చునా?" అని మావో-సే-టుంగ్ అడిగాడు.

అతనాపుస్తకం ఇచ్చాడు. మరికొద్దిరోజులకు దానిని తిరిగి ఇచ్చివేస్తూ ఎంతో నమ్రతతో, ఏదో తప్పుచేసిన వానిలాగా.

"పుస్తకం పాడుచేశాను. క్షమించండి" అని మావో-సే-టుంగ్ అన్నాడు.

ఏమిటా అని ఆ కుర్రవాడు పేజీలు తిప్పిచూచాడు. చాలా చోట్ల గుర్తులుపెట్టి ఉన్నాయి. వాషింగ్టన్, నెపోలియన్, పీటర్

ది గ్రేట్, కాథరన్ ది గ్రేట్, వెల్లింగ్టన్, గ్లాడ్‌స్టన్, రూసో, మాంటెస్క్యూ, లింకన్‌ల జీవితచరిత్ర భాగాల్లో అన్నిటికన్నా ఎక్కువ గుర్తులు కనబడ్డాయి.

"మనదేశంకూడా బలమైన దేశంకావాలి; ఐశ్వర్యవంతం కావాలి. అందుకోసం మనం పాటుపడాలి. ఇంకా చైనా, కొరియా, ఇండియాదేశాలకు పట్టినదుర్గతి మనదేశానికి పట్టకుండా చూడాలి. ముందు 'బండిబోల్తాపడితే వెనకబళ్ళు జాగ్రత్తపడాల'న్న మన చైనా సామెత తెలుసుకదా ? మనమంతా ఏకంకావాలి. 'తనజాతి భవిష్యత్తును నిర్ణయించడంలో ప్రతిసామాన్య వ్యక్తికీ పాత్రఉన్నది. అని కు-యెన్-వు అన్న మాటలు అక్షరాలనిజం!' అని మావో-సే-టుంగ్ ఆ విద్యార్థితో అన్నాడు. కొంతసేపు ఆగి మళ్ళా ఇలా అన్నాడు.

"చైనాపతనం ప్రారంభమయినది ఈనాడుకాదు. కాబట్టి దానినొక బలమైన స్వేచ్ఛా ఐశ్వర్యాలతో తులతూగే దేశంగా పునర్నిర్మించేందుకుకూడా చాలకాలం పడుతుంది. అంతమాత్రంచేత మనం నిస్పృహ చెందకుండా ఇదిగో, ఇక్కడచూడు" అని ఆ పుస్తకంలో ఒకపేజీతిప్పి "మహావీరుడు వాషింగ్టన్ నాయకత్వం ఎనిమిది సంవత్సరాల విధి విరామంలేని పోరాటానంతరంగాని యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాకు విజయం లభించలేదు, స్వేచ్ఛ చేకూరలేదు. బాధామయమైన ఎనిమిది దీర్ఘసంవత్సరాల పోరాటం..." అని ఉద్వేగంతో అన్నాడు.

# విప్లవంతో తొలిసంబంధం

టుంగ్‌షాన్ పాఠశాలలో మావో-సే-టుంగ్ ఒక్క సంవత్సరమే గడిపాడు. ప్రయాణాకాంక్ష ఆయనలో ప్రబల మయింది. ఉపాధ్యాయుల్లో ఒకరు ఆయనకొక పరిచయ పత్రాన్నిచ్చాడు. మళ్లా మూట భుజానవేసుకొని బయలుదేరాడు.

ఈసారి సియాంగ్‌టాన్ నగరంలోని ఉన్నతప్రాథమిక పాఠశాలలో చేరాలని వెళ్ళాడు. కాని, ఆయన పొడవును చూచి చేర్చుకో నిరాకరించాడు ఆ పాఠశాల ప్రిన్సిపాల్. దానితో చాంగ్షా నగరం వెళ్ళాలనుకున్నాడు. అక్కడ సియాంగ్ సియాంగ్ ప్రాంతీయుల బిడ్డలకోసం ఒక ఉన్నతపాఠశాల ఉన్నదని ఆయనకు తెలుసు. మూడవతరగతి టిక్కెట్టుకొని, ప్రయాణీకులతో క్రిక్కిరిసిఉన్న ఒక చిన్న సియాంగ్‌నది స్టీమరుమీద చాంగ్షానగరానికి బయలుదేరాడు.

ఆ పట్టణం, అక్కడి కోలాహలం, వీథుల్లోని జనసమ్మర్దం అదంతా చూచి, మావో-సే-టుంగ్, సంభ్రమాశ్చర్యాలలో మునిగి తేలాడు. సియాంగ్‌టాన్‌లోని పాఠశాలాధికారిలాగా, ఇక్కడ కూడా తనను చేర్చుకో నిరాకరిస్తారేమో అని, మావో-సే టుంగ్ చాల దిగులుపడ్డాడు. కాని, ఏచిక్కూ లేకుండా తనను చేర్చుకొనే సరికి ఆశ్చర్య పోయాడు.

అది 1911 వ సంవత్సరం. మంచూ సామ్రాజ్యాన్ని కూల ద్రోసిన ఆ విప్లవం ప్రజ్వరిల్లిన సంవత్సరమది. స్వతస్సిద్ధమైన ఆత్మ

విశ్వాసంతోనే మావో-సే-టుంగ్ చాంగ్షా చేరుకున్నాడు. ఆయనలో విజ్ఞాన వికాసం, భావపరిణామం అమితంగా సాగినప్పటికీ, ప్రవర్తనలో ఎట్టిమార్పులేదు. ఆ నమ్రత, నిరాడంబరత్వం, పొదుపరితనం-అంతా యథా పూర్వమే.

మావో-సే-టుంగ్ తొలిసారిగా వార్తాపత్రికను చూచింది చాంగ్షానగరంలో. ఆపత్రికపేరు "ప్రజాశక్తి" (పీపుల్స్ స్ట్రెంగ్త్) టుంగ్-మెంగ్-హుయ్ సంస్థ (అదే తరువాత కొమింటాంగుగా మారింది.) పెట్టుబడి పెట్టి నడిపిన పత్రిక అది. మంచూ చక్రవర్తులకు వ్యతిరేకంగా కాంటన్ నగరంలో జరిగిన ఒక సాయుధ తిరుగుబాటులో ప్రాణాలర్పించిన 72 మంది వీరులనుగురించి ఆ పత్రిక ప్రచురించిన ఒక వ్యాసాన్ని మావో-సే-టుంగ్ చదివాడు. ఆయన హృదయం కంపించిపోయింది. డాక్టరు సన్-యెట్-సేన్, టుంగ్-మెంగ్-హుయ్ సంస్థ ప్రతిపాదించిన రాజకీయ ప్రణాళికను గురించి కూడా మావో-సే-టుంగ్ అప్పుడే తెలుసుకున్నాడు. ఆయన సంతోషం ఇంతంతకాదు. దానినిగురించి తానే ఒక వ్యాసంరాసి, తక్కిన విద్యార్థులుకూడా చదవడంకోసం, తన పాఠశాలలో గోడకు అంటింపజేశాడు. సన్-యట్-సెన్‌ని వెంటనే జపానునుండి రప్పించి చైనా అధ్యక్షునిగా నియమించాలనీ, ఆయనకింద ఏర్పడే కొత్త ప్రభుత్వంలో కాంగ్-యూాంగ్-లీ ప్రధానమంత్రిగానూ, లియాంగ్-చి-చావో విదేశాంగమంత్రిగా ఉండాలనీ ఆ వ్యాసంలో రాశాడు. సన్-యట్-సెన్ దృక్పథానికీ, కాంగ్, లియాంగ్‌ల భావాలకీ గల వ్యత్యాసాన్ని మావో-సే-టుంగ్ అప్పటికింకా గ్రహించలేకపోయాడని వేరే చెప్పనక్కరలేదు. కాని ఒక్క భావం మాత్రం ఆయనలో స్పష్టంగా రూపొందింది. సంస్కరణోద్యమం కోసం, విప్లవం కోసం కృషిచేసేవారంతా ఒక్కటై, వీరికి మంచూచక్రవర్తుల

నిరంకుశ పాలనను ఏకముఖంగా ప్రతిఘటించాలనేదే ఆయన ప్రగాఢ భావం.

చైనాపై అంతర్జాతీయ సామ్రాజ్యవాద దురాక్రమణ ప్రారంభమైనది మొదలు మంచూ ప్రభుత్వం ద్విముఖ విధానం అనుసరించ నారంభించింది. వైదేశిక రంగంలో సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తుతూ, ప్రతి సమస్యమీద వారికి జోహుకుం అనసాగింది. అదే సమయంలో ఇండో చైనా ప్రజలను పీడించి, నిలువునా దోచుకోవడం మరింత తీవ్రం చేసింది. ఈ మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, దాని దోపిడీ పన్నులను, అది తెచ్చి పెడుతూన్న ఆకలి బాధలను ఇక సహించమని విశాల ప్రజానీకం అప్పటికే ఎన్నోసార్లు విజృంభించారు. రైల్వేలను జాతీయం చేయడానికంటూ మంచూ ప్రభుత్వం ఒక బిల్లును ప్రవేశపెట్టింది. పేరు ఎలా గున్నా, నిజానికది రైల్వేలపై సర్వహక్కులను పరాయి సామ్రాజ్య వాదులకు అమ్మడానికి పన్నినకుట్రఅని ప్రజలుగ్రహించారు. ఆప్రయత్నాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. మంచూ నిరంకుశత్వాన్ని బాహాటంగా ఖండించనారంభించారు. దేశానికొక రాజ్యాంగచట్టంతయారు కావాలి, పార్లమెంటును సమావేశపరచాలన్న నినాదం ప్రబలమయింది. విప్లవవాదుల నాయకత్వాన సాయుధ పోరాటాలు రోజుకీ రోజుకీ పెచ్చుపెరిగాయి.

పాత, క్రొత్తలమధ్య తీవ్రసంఘర్షణలకు హూనాన్ రాష్ట్రం మొదటినుంచీ రంగస్థలం. నవసంస్కృతి తొలిసారిగా వికసించింది అక్కడే. సంస్కరణోద్యమంలో విప్లవ భావాలు కలిగినవారందరూ హూనాన్ రాష్ట్రంనుంచే వచ్చారు. "ప్రస్తుత సమస్యల పాఠశాల" ప్రథమంగా ఏర్పడింది కూడా హూనాన్‌లోనే. రవాణా మార్గాల అభివృద్ధి, గని పరిశ్రమలను ప్రారంభించడం, సైనికశిక్షణాలయాలను

స్థాపించడం, పౌరసైనికదళాల నిర్మాణం మొదలైన వాటికి ప్రణాళికలు తయారయాయి. "దక్షిణాది మేధావుల సంఘం" అని మరొక సంస్థ కూడా అక్కడ ఉండేది. దాని సభ్యత్వం వెయ్యికి పైగా పెరిగింది. "దక్షిణాదిని గల దేశభక్తులందరిని ఏకంచేసి, దేశభక్తికి మూలకారణాలను చర్చించడం, చైనా సముద్ధరణను తగు విధానాలను రూపొందించడం దీని ఆశయం. ఈకార్యక్రమమంతా హూనాన్ నుండి ప్రారంభం కావాల"ని దాని ఉద్దేశం. (లియాంగ్ చి-చావో కలెక్టెడ్ వర్కు్సలోని టాన్ సు-టుంగ్ జీవిత చరిత్రనుండి.) హూనానులో రెండు పత్రికలుకూడా ఉండేవి. సియాంగ్ సుయె సిన్ పావో అనేపత్రిక పదిరోజుల కొకసారి వెలువడేది. సియాంగ్ పావో మొదట దినపత్రికగా ఉండి, తరువాత మాసపత్రిక అయింది. ఈ రెండిటికీ చాల పలుకుబడి ఉండేది. వీటన్నిటి ఫలితంగా హూనాన్ రాష్ట్రం తక్కిన రాష్ట్రాలన్నిటికన్నా అగ్రగామిగా ఉండేది.

హువా సింగ్ సొసైటీ నాయకుడయిన హువాంగ్ సింగ్ చాంగ్షా నివాసి. ఆ సొసైటీ టుంగ్-మెంగ్-హుయ్ సంస్థలో ఒక భాగంగా ఉండేది. 72 మంది విప్లవవీరులు ఆత్మార్పణచేసిన కాంటన్ తిరుగుబాటుకి నాయకత్వం వహించినది కూడా అతనే. ఈ72మంది వీరులదారుణమరణం, దానితోపాటు ఆన్‌హ్వా రాష్ట్రంలో విప్లవ కార్యక్రమాల్లో పాల్గొన్న సు-సి-లిన్, చియు-చిన్‌ల శిరచ్ఛేదనం, హూనాన్ ప్రజల్లో తీవ్ర సంచలనం కలిగించాయి. ఆగ్రహావేశాలతో వారు ఉవ్వెత్తున లేచారు. రైల్వేలను జాతీయం చేస్తామంటూ ప్రభుత్వం తలపెట్టిన కుట్రను ప్రతిఘటించడంలో వారు ముందు నిలిచారు. రాజ్యాంగ చట్టంకోసం, పార్లమెంటు నిర్మాణంకోసం సాగిన ఆందోళనను సర్వశక్తులతో బలపరిచారు. ఈనాడు సుప్రసిద్ధ విప్లవ వృద్ధవీరుల్లో ఒకరైన సు-టె-లి, పార్ల

మెంటు స్థాపనకై విజ్ఞాపన పత్రాన్ని, తన ప్రేలుకోసి, ఆ రక్తంతో రాసి పంపాడు. ఆ విషయమై ప్రజల ఉద్రేకం అంత తీవ్రంగా ఉండేది ఆనాడు.

విప్లవవెల్లువ ప్రజల్ని ముంచెత్తసాగింది. షాంగ్‌హై 'దేశ సేవకుల సమితి' వారు 1903 లో విప్లవ చర్యకు పూనుకున్నారు. అప్పటినుంచి మంచూ వ్యతిరేక ప్రచారంలో ప్రత్యక్షంగా పాల్గొనేందుకు మేధావులు రోజురోజుకీ ఎక్కువమంది ముందుకు రానారంభించారు. ప్రజా సామాన్యంలో విప్లవ భావాలను వెదజల్లేందుకు దేశమంతటా ఉపాధ్యాయులు, విద్యార్థులు రాత్రి పాఠశాలలు ప్రారంభించారు. కరపత్రాలు ప్రచురించారు.

పురుషులందరూ నిడుపాటి పిలకలు ఉంచుకోవాలనే ఆచారాన్ని మంచూ చక్రవర్తులు దేశమంతటా అమలుజరిపారు. మంచూ పాలనపట్ల తమ తీవ్ర వ్యతిరేకతను వ్యక్తంచేయగల రూపం, ఈ పిలకలను కత్తిరించివేయడం ఒక్కటే అని విద్యార్థిలోకం నిశ్చయించుకుంది. తాను చదువుకుంటూన్న ఉన్నత పాఠశాలలో ఈ ఉద్యమం ప్రారంభకుల్లో ఒకడు మావో - సే - టుంగ్. ఆయనా, ఆయనలాగే పిలక కత్తిరించేసుకున్న మరొక విద్యార్థీ కలిసి తక్కిన విద్యార్థుల పిలకల పని పట్టించ నారంభించారు. మరొక పదిమంది విద్యార్థులు ఈ ఉద్యమంలో చేరుతామని ముందు మాటఇచ్చి, తరువాత ధైర్యంచాలక వెనక్కు తగ్గారు. మావో-సే-టుంగ్, అతని మిత్రుడూ కలసి ఆ పదిమందిని పట్టుకొని పిలకలు కత్తిరించేశారు.

అవి 1911 విప్లవపు తొలిఘడియలు. "మంచూ ప్రభుత్వాన్ని పారదోలాలి!" "స్వతంత్రచైనా!" "రిపబ్లిక్కును స్థాపించాలి!" "భూమిపై అందరికీ సమానహక్కు!" మొదలైన నినాదాలు ప్రజల

హృదయాల్లో గాఢంగా నాటుకుపోయాయి. విప్లవకారుల కార్య కలాపాలు రోజురోజుకీ ముమ్మరమయాయి. విప్లవానికై ప్రజల ఆకాంక్షను ఎవ్వరూ కాదనలేని పరిస్థితులేర్పడ్డాయి.

యువకుడు, ఆవేశపరుడు అయిన మావో - సే - టుంగ్ ఈ విప్లవప్రవాహంలో పూర్తిగా మునిగితేలాడు.

## విప్లవంకోసం సైనికశిక్షణ

1911 అక్టోబరు 10 వ తేదీని వుచాంగ్ తిరుగుబాటు ప్రారంభ మయింది. అసలది మరొక నలభై రోజుల తరువాత, డవేజర్ రాణీ జన్మదినోత్సవం నాడు ప్రారంభించాలనుకున్నారు. కాని, ఈలోగానే విప్లవపక్ష సభ్యుల జాబితా మంచూ ప్రభుత్వ గూఢచారుల చేతిలో పడింది. అరెస్టులు, హత్యలు ప్రారంభమయాయి. తత్ఫలి తంగా అనుకున్నదానికన్నా ముందుగానే తిరుగుబాటు ప్రారంభించక తప్పలేదు.

చాంగ్షాలో వాతావరణం రగులుకుంటూన్న అగ్నిపర్వ తంలా మారిపోయింది. హూనాన్ రాష్ట్ర గవర్నరు మార్షల్ లా అమలుజరిపాడు. అయినప్పటికీ నగర ప్రాకారాలలోపలా, బయటా కూడా విప్లవకారులు తమ రహస్య కార్యకలాపాలు నిరంతరాయం గానే కొనసాగిస్తూ వచ్చారు. కొందరు పాఠశాలల్లో మంచూ వ్యతిరేకత, హాన్ (చైనాలో మెజారిటీజాతి) అనుకూలత బోధిం చారు. మరికొందరు నగరంవెలుపల సమీకరించబడిన కొత్తసేనలో రహస్య ప్రచారానికి పూనుకొని ఆ సైనికులను తిరుగుబాటుకు పురికొల్పసాగారు.

ఒకనాడు మావో-సే-టుంగ్ చదువుకుంటూన్న పాఠశాలకు ఒక విప్లవవాది వచ్చాడు. ప్రిన్సిపాల్ అనుమతిపొంది ఒక ఉపన్యాసం

చేశాడు. ఆ ప్రసంగం విన్నవారందరి హృదయాలను ఉద్రేకంతో ఉర్రూతలూగించింది. ఎందరో విద్యార్థులు లేచి మంచూ పాలనను ఖండించారు; తక్షణం రిపబ్లిక్కు ప్రభుత్వం ఏర్పడాలన్నారు. ప్రతి ఒక్కరూ ఆవేశ పరవశులయ్యారు.

ఆ ఉపన్యాసం మావో-సే-టుంగ్‌లో తీవ్రమైన సంచలనం కలిగించింది. ఏమైనాసరే విప్లవోద్యమంలో చేరనిశ్చయించాడు. ఏవిధంగా తాను విప్లవోద్యమానికి ఎక్కువగా ఉపయోగపడగలనన్న విషయమై అయిదురోజులు ఆలోచించాడు. సైనిక శిక్షణ పొందగలిగితే తనవల్ల ఎక్కువ ఉపయోగం ఉంటుందన్న నిర్ణయానికి వచ్చాడు. హూపేరాష్ట్ర గవర్నరయిన లి-యువాన్-హుంగ్ నాయకత్వం కిందనున్న విప్లవసైన్యంలో చేరనిశ్చయించాడు. ప్రయాణం ఖర్చులకు తనవద్ద డబ్బులేదు. తోటివిద్యార్థులవద్ద అప్పుతీసుకొని వుచాంగ్‌కు బయలుదేరాడు. ఆయనతో కలిసి మరికొందరు విద్యార్థులుకూడా వెళ్ళారు. వుచాంగ్ నగరంలో వీధులన్నీ తడిగాఉంటాయి కాబట్టి నీరింకనిచర్మంజోళ్ళు ఉండడం మంచిదని కొందరు సలహా ఇచ్చారు. తన స్నేహితుడయిన ఒక రైతువద్ద అలాంటి జోళ్ళున్న సంగతి మావో-సే-టుంగ్‌కి జ్ఞాపకంవచ్చింది. పైగా ఆస్నేహితుడు తన ఊరివాడే. అతనప్పుడు నగరంవెలుపలఉన్న కొత్తసైన్యంలో ఉన్నాడన్నసంగతి మావో-సే-టుంగ్‌కి తెలుసు. అతనిని కలుసుకునేందుకు సైనికశిబిరంవద్దకు బయలుదేరాడు. కాని అక్కడికి వెళ్ళేసరికి పహారాసైనికుడు అతనిని ఆపివేశాడు.

ఏదో విశేషం ఉన్నట్లు కనుపించింది. టుంగ్-మెంగ్-హుయ్, కి-లో-హుయ్ సంస్థలకు చెందినవారు, కొత్తసేన 49వ 50వ బ్రిగేడ్లలో అదివరకే ప్రవేశించారు. నాయకుల్లో ఒకడైన హువాంగ్ సింగ్ ఆసమయంలో హూనాన్‌లోలేదు. ఈ కార్యక్రమానికి నాయ

కత్వం వహించి నడుపుతున్నది కి-లో-హుయ్‌సంస్థ. ఆరెండు బ్రిగేడ్లను విప్లవోద్యమంవైపు తిప్పి, వుచాంగ్ - హాంకౌ విప్లవదళాల శ్రేణిలో చేరేలా చేసిందికూడా ఆ సంస్థే. మావో-సే-టుంగ్ అలా ఆ సైనికశిబిరంవద్దకు వెళ్ళిననాడు, సైనికులకు మందుగుండు సరఫరా అప్పుడే అందింది. మందుగుండునంతా అందుకొని చాంగ్షా నగర ప్రవేశానికి ఆ సేన పూర్తిబలగంతో కదిలింది. అదంతా తెలుసుకొని మావో-సే-టుంగ్ వెంటనే నగరానికి తిరిగివచ్చాడు. నగర ద్వారాలు మూసి ఉన్నాయిగాని గడియలు బంధించిలేవన్నది గమనించాడు.

ఆవేళ ఆదివారం. ఉదయంపూట కొత్త సేన ఒక ద్వారం వైపు వచ్చింది. అక్కడ కొన్ని తూటాలు పేల్చిన తరువాత, తామర కొలనువద్దనున్న ఆయుధాగారం పట్టుకునేందుకు ఒక దళం వెళ్ళింది. మిగతా సేన, ఆ ద్వారంగుండా సరాసరి గవర్నరు భవనం వైపు సాగింది. అక్కడి కాపలా సైనికులు ఏమాత్రం ప్రతిఘటించలేదు. గవర్నరు లొంగక తప్పలేదు. వెంటనే గవర్నరు భవనం మీద ఒక పెద్ద శ్వేత పతాకను ఎగురవేశారు. ఆ మరుక్షణం లోనే అన్ని పాఠశాలలమీదా, కార్యాలయాలు, అంగళ్ళమీదా అదేవిధంగా పెద్దవీ, చిన్నవీ తెల్లజండాలు రెపరెపలాడసాగాయి.

సైనిక శిబిరంవద్దనుండి మావో-సే-టుంగ్ తిరిగివచ్చి, తన పాఠశాలను చేరుకునేలోగానే ఇదంతా జరిగిపోయింది. ఆయన తిరిగి వచ్చేసరికి తన పాఠశాల ద్వారంమీదనే ఒకపెద్ద తెల్లజెండా ఎగురుతూంది. కొంతమంది సైనికులు బయట కాపలాకూడా ఉన్నారు. హూనాన్ రాష్ట్రం ఆనాడే, ఆ విధంగా మంచూ పాలననుండి విముక్తిని, స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుంది.

కి-లో-హుయ్ సంస్థ హూనాన్ శాఖకు చెందిన ఇద్దరు నాయకులు రాష్ట్ర గవర్నరుగానూ, ఉప గవర్నరుగానూ ఎన్నికైనారన్న వార్త ఆ వేళ మధ్యాహ్ననికల్లా చేరింది. ఆనాడు బాగా మేఘం కమ్మిఉంది. ప్రజలు ఏ క్షణాన ఏమవుతుందో అన్న ఆందోళనతో ఉన్నారు. కాని, ఆ ఆందోళన ఎంతోసేపు లేదు. త్వరలోనే అందరి ముఖాలు కలకల్లాడాయి. ఇంత సునాయాసంగా విప్లవం జరిగిపోతుందని ఎవరైనా కలలోకూడా అనుకున్నారా?

కాని పతనావస్థకువచ్చి, ఊగిసలాడుతున్నా, మంచూ ప్రభుత్వం ఇంకా కూలిపోలేదు. యుద్ధం ఇంకా కొనసాగింది. చాంగ్షా నగరం మిలిటరీ కార్యకలాపాలతో మహా కోలాహలంగా ఉంది. వుచాంగ్-హాంకౌ రంగంలో విప్లవ దళాలకు వెంటనే సహాయము పంపే కార్యక్రమము, కొత్త సైనికుల సమీకరణఒకవైపు, మరొకవైపు ఉత్సాహవంతులైన కొంతమంది యువకులు విద్యార్థి సైన్యం అని ఒకదానిని తయారు చేశారు.

విప్లవ సేనలో చేరాలనే దీక్ష బలీయంగా ఉన్నప్పటికీ, మావో-సే-టుంగ్‌కి ఈ విద్యార్థి సైన్యంలో చేరడానికి మనసు పుట్టలేదు. విప్లవ బాధ్యతలను నెరవేర్చడానికి అది చాల దుర్బలమైన సాధనమని ఆయన భావించాడు. సరాసరి విప్లవ సైన్యంలో చేరడం తప్ప మరేదీ పనికిరాదని నిశ్చయించుకున్నాడు. విప్లవానికి నిజమైన, నిర్మాణాత్మకమైన సేవచేయడమే తన లక్ష్యంగా పెట్టుకున్నాడు. విప్లవం జయప్రదం కావాలంటే యుద్ధం అవసరం. కాబట్టి విప్లవానికి ఉపయోగపడేందుకు సైనికుణ్ణి కావడమే ఉత్తమోత్తమ మార్గం అని మావో-సే-టుంగ్ వాదన.

అప్పటికి ఆయన వయసు పద్దెనిమిది సంవత్సరాలు. కాని వయసుకు మించిన పొడవరి. అంతవరకు ఆ పొడవు ఆయనకొక

ప్రతిబంధకంగానే ఉంది. ఉదాహరణకు సియాంగ్ సియాంగ్ ఉన్నత ప్రాథమిక పాఠశాలలో చేరాలని వెళ్ళినప్పుడు, ఆ పొడవును చూచే పాఠశాలాధికారి చేర్చుకోను పొమ్మన్నాడు. ఇప్పుడు ఆ పొడవే ఆయనకెంతో ఉపయోగపడింది. విప్లవ సైన్యానికి బాగా పొడవైన వాళ్ళు కావలసివచ్చింది. అందువల్ల ఆయన దరఖాస్తు పెట్టుకోగానే చేర్చుకున్నారు. ఆయన చేరిన పటాలానికి న్యాయస్థానం ఆవరణలో విడిది ఇచ్చారు. అప్పటికింకా న్యాయస్థానాల్లో పని తిరిగి ప్రారంభం కాలేదు. మామూలు శిక్షణ, కవాతే కాకుండా, కొత్తగా చేరిన సైనికులకు ఇతర చిల్లర పనులు అనేకం అంటగట్టేవారు. ఒకచోటు నుంచి మరొక చోటుకి మారేటప్పుడు సైనికోద్యోగుల మంచాలూ, బిచానాలూ, పెట్టెలు మొదలైనవన్నీ వీరే మోయాలి. దీనికితోడు యీ కొత్త సైనికులే వంతులు వేసుకొని, సైనికులు త్రాగడానికి, ఉద్యోగులకు టీ కాచడానికి కావలసిన నీళ్ళన్నీ మోసుకురావాలి.

తన సోదర సైనికులందరితోనూ మావో-సే-టుంగ్‌కు చాల స్నేహం ఏర్పడింది. అధికారులకు కూడా ఆయనపై అభిమానం ఏర్పడింది. ఇంటికో, స్నేహితులకో ఉత్తరాలు రాసుకోవాలంటే ఆయన దగ్గరకే వచ్చేవారు. ఆయన ఎవ్వరికీ కాదనేవాడు కాదు. ఓపికతో ప్రతి ఒక్కరికీ సాయం చేసేవాడు. ఇతర సైనికులతో సంభాషణలలో, వారి పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకునేందుకు ఎప్పుడూ ప్రయత్నించేవాడు. వారిలో చాలమంది మంచి నిజాయితీపరులైన రైతులేనని ఆ విధంగా తెలుసుకున్నాడు. గని కార్మికులు, కమ్మరి పనివారు, ఇతర వృత్తుల కార్మికులు కూడా వారిలో కొందరున్నారు. వారందరిపట్ల ఆయన ఎంతో ఆదరాభిమానాలతో వ్యవహరించేవాడు. వారిలో ప్రతి ఒక్కరూ ఆయనను తన స్వంత స్నేహితునిగా భావించేవారు. కాని, కొత్తగా చేరిన ఒక సైనికుడు

మాత్రం పచ్చిరౌడీగా ప్రవర్తించేవాడు. వాడిని అందరూ అసహ్యించు కొనేవారు; అందరికీ వాడంటే హడలు. మావో-సే-టుంగ్ పట్ల కూడా వాడు దురుసుగా ప్రవర్తించబోయాడు. కాని, ప్రతిసారీ మావో-సే-టుంగ్ వాడికి తగినపాఠం నేర్పేవాడు. అందుకు అందరూ సంతోషించారు. ఇక వాడు మావో-సే-టుంగ్ జోలికి రావడం మానుకున్నాడు.

## సోషలిజం ఆయన లక్ష్యం

ఆ రోజుల్లో కొత్తగా చేరిన సైనికులకు నెలకు ఏడు డాలర్లు జీతం ఇచ్చేవారు. చాలమంది తిండి, త్రాగుడు, ఇతర జల్సాల కింద ఆ జీతాన్నంతా ఖర్చుపెట్టేసేవారు. కాని మావో-సే-టుంగ్ అలా కాకుండా జాగ్రత్తగా లెక్క వేసుకొని ఖర్చుపెట్టేవాడు. భోజనానికి రెండు డాలర్లు, మంచినీళ్ల కింద చాల కొద్ది పైకం - ఈ విధంగా ఉండేది ఆయన బడ్జటు. ఆయన ఒకే ఒక్క వినోదం కింద డబ్బు ఖర్చుపెట్టేవాడు. కొన్ని పత్రికలకు చందా కట్టి చదవడమే ఆయన ఎంచుకున్న 'వినోదం'.

సైన్యంలో చేరకముందే, ఉన్నతపాఠశాలలో చదువు కుంటున్న రోజులనుంచీ ఆయనకు పత్రికలపట్ల శ్రద్ధ ఏర్పడింది. క్రమ క్రమంగా పత్రికాపఠనం ఆయనకు అత్యంత అభిమానమైన విషయ మైంది. ప్రతిరోజూ పత్రికనాలుగుపేజీలూ, ఒక్క అక్షరం విడిచిపెట్ట కుండా చదివేవాడు. వార్తలు, ప్రస్తుత విషయాలపై వ్యాఖ్యలు, వివిధవ్యాసాలు-పత్రికలోని ఈ విధమైన వైవిధ్యం ఆయనకెంతో ఆహ్లాదాన్ని కలిగించేది. పత్రికాపఠనంద్వారా ఉపయుక్తమైన విషయాలు ఆయనెన్నో తెలుసుకున్నాడు. అన్నిటికన్నా ముఖ్య

మైనది దైనందిన ఘటనలనూ, సాంఘిక సమస్యలను పరిశీలించి అవగాహన చేసుకునే పట్టుదల ఆయనలో రేకెత్తించింది.

1911 విప్లవం ఫలితంగా మంచూ ప్రభుతం నేలకూలింది. దానితో, రకరకాల రాజకీయ అభిప్రాయాలు స్వేచ్ఛగా పైకుబుక సాగాయి. టుంగ్-మెంగ్-హుయ్ సంస్థ (ఇదే తరువాత కొమింగ్ టాంగ్ గామారింది) కాకుండా ఫ్రీడమ్ పార్టీ, ప్రోగ్రసివ్ పార్టీ, సోషలిస్టుపార్టీ మొదలయిన అనేకపార్టీలు వెలిశాయి. వాటిలో కొన్ని మూన్నాళ్ళ ముచ్చటగానే ఉండి, అంతరించిపోయాయి.

ఒకసారి మావో-సే-టుంగ్ సోషలిజం గురించి ఒక వ్యాసాన్ని పత్రికలో చదివాడు. మరి కొద్దిరోజులకు, అదే విషయం గురించిన కొన్ని చిన్న పుస్తకాలు చదవడం తటస్థించింది. వాటిలో ఉన్నదంతా సోషలిజం గురించి అసమగ్రమైన విషయాలే అని వేరేచెప్పనక్కరలేదు. తాము విన్నవీ, విదేశగ్రంథాల్లో కన్నవీ చేర్చి రచయితలు వాటిని తయారుచేశారు. సోషలిజం అంటే సమగ్ర దృక్పథం వారిలో ఒక్కరికీలేదు. పైపెచ్చు చాలమందిలో సోషలిస్టు-సంస్కరణవాద ధోరణికూడా లేకపోలేదు. ఇన్ని అవకతవకలున్నప్పటికీ మావో-సే-టుంగ్‌కి ఆ రచనలు ఎంతో ఆనందాన్ని, ప్రోత్సాహాన్ని చేకూర్చాయి. కొత్తపోకడలంటే ఆయనకుగల ఉత్సాహమూ, న్యాయమని తాను నమ్మినదానిని ఎట్టిపరిస్థితుల లోనూసమర్థించి నిలవగల ధైర్యస్థైర్యాలే, లోపభూయిష్టమైనప్పటికీ రచనలనుచూచి ఆయనంత సంతోషించేందుకు కారణం. లోక కళ్యాణానికి, మానవజాతిశ్రేయస్సుకి ఇంతవరకు జరిగిన సిద్ధాంతాలన్నిటిలోకి ఉత్తమోత్తమమైనది సోషలిజంఅని ఆయనకు విశ్వాసం ఏర్పడింది. ఆదృష్టితోనే, సోషలిజం గురించి తన తోడిసైనికులతో చర్చలు ప్రారంభించాడు.

టుంగ్‌షాన్ ప్రాథమిక పాఠశాలను విడిచిపెట్టి ఏడాదికిపైగా అయినప్పటికీ, అక్కడి తనపాత స్నేహితులతో మావో-సే-టుంగ్ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే వుండేవాడు. కొత్తగా సోషలిజాన్ని కనుగొన్నప్పుడు కలిగిన ఆనందాతిశయంతో దానిని గురించి ఆ మిత్రులకు జాబులురాశాడు.

♦ ♦ ♦

ఉచాంగ్ తిరుగుబాటును తొలిసారిగా అనుసరించింది చాంగ్షా. ఆ తరువాత, వెంటవెంటనే కియాంగ్సి, షెన్సి, షాన్సి, యునాన్, కియాంగ్సు, చెకియాంగ్, క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సి, ఫ్యుకీన్, షాంటుంగ్, జెచువాన్, క్వీచౌ, కాన్సు, సింకియాంగ్ రాష్ట్రాలన్నీ వరుసగా తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాయి. విప్లవం ప్రారంభమయిన తరువాత ఒక నెల తిరక్కముందే,విప్లవసైన్యం 17 రాష్ట్రాలను స్వాధీనంచేసుకుంది. 268 సంవత్సరాలు డాబు దర్పాలతో కొనసాగిన మంచూ కరకు నిరంకుశపాలన, ఆ విధంగా త్వరత్వరగా నేల కూలింది.

నేలకరిచేముందు కూడా అది తన కుతంత్రాలు మానలేదు. విప్లవపురోగమనాన్ని నిరోధించేందుకు కొంత రాజీధోరణి కనబరచింది. చక్రవర్తి అధికారాలను చాలవరకు తగ్గిస్తూ 19 అంశాలతో ఒక రాజ్యాంగచట్టాన్ని ప్రకటించింది. యువాన్-షి-కాయ్‌ని ప్రధానమంత్రిగా నియమించి, మంత్రివర్గాన్ని ఏర్పరచే అధికారాన్ని అతనికే పూర్తిగా ఇచ్చేశామన్నారు.

పెద్దభూస్వాములు, విదేశీ పెట్టుబడిదారులతో చేతులుకలిపిన స్థానిక ధనికవర్గాలు మొదలైన అభివృద్ధినిరోధకుల నాయకుడైన యువాన్-షి-కాయ్ తమపక్షం ఉంటాడనే మంచూ రాజవంశం ఆశించింది. తమకతను ద్రోహం తలపెడతాడని కలలోకూడా అనుకో

లేదు. తనచేతికిందనున్న 'ఉత్తరాది సైన్యాన్ని' ఉపయోగించుకొని అతను ప్రభుత్వాధికారాన్ని పూర్తిగా కైవశంచేసుకున్నాడు. ఆపని పూర్తి చేసుకొని, విప్లవోద్యమంపై విరుచుకుపడ్డాడు. శైశవావస్థలో, అస్థిరస్థితిలోఉన్న విప్లవాన్ని రూపుమాపేందుకు, ఉచాంగ్-హాంకౌ రంగంమీద దాడి ప్రారంభించాడు. హాంకౌనగరానికి ఎట్టెదుట ఉన్న హన్యాంగ్‌ని ఆక్రమించుకున్నాడు.

ఈలోగా ఏమైనాసరే నాంకింగ్‌ని విడిచిపెట్టనని దంబాలు పలికిన చాంగ్-సున్*ని విప్లవసైన్యం పూర్తిగా ఓడించింది. ప్రజాసైన్యం (వెనుకటి కొత్తసైన్యం) నాంకింగ్‌లో ప్రవేశించింది. విప్లవ నాయకులు, అదివరకు షాంఘై నగరంలో ఏర్పరచిన 'రాష్ట్రగవర్నర్ల సమిష్టిసమావేశం' అక్కడనుంచి నాంకింగ్‌కు తరలింది. మధ్యలో కొన్నాళ్ళు ఉచాంగ్-హాంకౌలలో గడిపింది. డాక్టర్ సన్‌యట్‌సేన్ అధ్యక్షతకింద "చైనారిపబ్లిక్ తాత్కాలికప్రభుత్వా"న్ని ఏర్పరిచారు. సుప్రసిద్ధమైన "తాత్కాలిక రాజ్యాంగచట్టాన్ని" తయారుచేసి అమలుజరిపారు.

పెట్టుబడిదారీ దేశాల్లో కార్మికోద్యమమూ, శ్రామికవర్గ సంస్థలూ దినదినాభివృద్ధి చెందుతూన్న రోజులవి. మార్క్సిజం 1845 లోనే అంకురించిందనీ, మొదటి ఇంటర్నేషనల్ 1864 లో స్థాపించబడిందనీ ఈ సందర్భంలో జ్ఞప్తికితెచ్చుకోవాలి. చైనాలో పెట్టుబడీదారీవిధానం ఏర్పడినతరువాత, కార్మికవర్గం కూడా రూపొందింది. నిరంతరాయంగా సాగిన చైనా ప్రజాపోరాటాలఫలితంగా ఈ వర్గంకూడా అభివృద్ధికాసాగింది. కాని, తాత్కాలిక చైనా

* చాంగ్-సున్ (1855-1923) యువాన్-షి-కాయ్ నాయకత్వంకింద ఉండిన మిలిటరీ పెత్తందారు.

భుత్వం ఏర్పడిననాటికి ఆ కార్మికవర్గం చాల బలహీనం
ఒక స్వతంత్రరాజకీయశక్తిగా ఇంకా రూపొందలేదు.
రైతులు, చేతివృత్తులవారు, మధ్యతరగతివారు, బూర్జువా
తదితర విప్లవానుకూలవర్గాల విషయం - వారిలో
అప్పటికింకా నిర్మాణాత్మకంగా సంఘటితం కాలేదు.
దంతా చాల ప్రాథమిక రాజకీయచైతన్యం మాత్రమే.
విప్లవాన్ని నడిపినవారు, అందులో పాల్గొన్నవారు, దానికి నైతిక
సహకారం మాత్రమే అందజేసినవారూ విభిన్న సామాజికవర్గాలకు
చెందినవారే. వారిలక్ష్యాలు కూడా చాల భిన్నమైనవే. నిజం
చెప్పాలంటే వారందరిలోనూ ఏకాభిప్రాయం ఉన్నది, మంచూ
ప్రభుత్వాన్ని వ్యతిరేకించాలన్న ఒక్క విషయంలో మాత్రమే.
అది మినహాయిస్తే పరస్పర వ్యతిరేకలక్ష్యాలు, విభిన్నదృక్పథాలు
ఎన్నో బయటపడేవి.

అటుచూస్తే విప్లవోద్యమం సరియయిన నిర్మాణస్వరూపం
లేక, దుర్బలస్థితిలో ఉంది. అలాంటిపరిస్థితులలో భూస్వాములు
విదేశపెట్టుబడిదారుల తాబేదారులు, మిలటరీ పెత్తందార్లు, నిరంకుశ
అధికారవర్గాలు విప్లవంసాధించిన ఫలితాలను చేజిక్కించుకోవడంలో
వింత ఏమిలేదు. ఈ వర్గాల ముఖ్యప్రతినిధిగా యువాన్-షి-కాయ్
చాల చాకచక్యంతో వ్యవహరించాడు. కుతంత్రాలద్వారా విప్ల
వోద్యమాన్ని తన స్వార్థ ప్రయోజనాలకు సాధనంగా ఉపయో
గించుకోగలిగాడు.

హునాన్ లో కూడా పరిస్థితిమారింది. టాన్-యన్-కాయ్*
రాష్ట్రగవర్నరయాడు. విప్లవసన్నాహాలలో ప్రముఖపాత్రవహించిన

---

* టాన్-యన్-కాయ్ (1876-1930) కొమింటాంగ్ ప్రభుత్వంక్రింద పెద్ద
పదవుల్లోకి వచ్చాడు.

చియావో-టా-ఫెంగ్, చెన్-సో-సిన్ అనేఇద్దరు కి-లా
నాయకులు దారుణంగా హత్యచేయబడ్డారు. శ
విప్లవనాయకులు సానుభూతిపరులు యువాన్ - షి -
లాలూచీలు ప్రారంభించారు. విప్లవం జరిగిపోయింది కా
దక్షిణాలమధ్య (యువాన్-షి-కాయ్ ప్రభుత్వానికీ, చైనారిపబ్లిక్ తాత్కాలిక ప్రభుత్వానికీ) ఇకతగాదా అనవసరం; ఈరెంటిమధ్య శాంతికుదిరి, చైనాఅంతా తిరిగి ఏకంకావాలన్న వాదనను వీరు లేవదీశారు. ఆ నెపంతో, అన్నివిషయాల్లోనూ యువాన్-షి-కయ్‌కి లొంగిపోవడం ప్రారంభించారు. మంచూ చక్రవర్తిచేత సింహాసన పరిత్యాగం చేయిస్తే, చైనారిపబ్లిక్ అధ్యక్షుపదవిలోంచి సన్-యట్-సేన్‌ని తొలగించి, అతనికీ ఆపదవి కట్టబెడతామన్నారు. నాంకింగ్ ప్రభుత్వాన్ని చైనారిపబ్లిక్ తాత్కాలికప్రభుత్వాన్ని రద్దుచేసేందుకు పెకింగ్‌నగరాన్నే చైనారాజధానిగ గుర్తించేందుకు...ఇంకా ఇలాగే ఎన్నో విషయాల్లో యువాన్-షి-కయ్‌కి లొంగిపోయేందుకు వారు అంగీకరించారు. ఈ విధానానికి సన్-యేట్-సేన్ ఏమాత్రం అంగీకరించలేదు. కాని, పార్టీలో అధికసంఖ్యాకులు స్వప్రయోజనాల కోసం ఆవిధానాన్ని బలపరచడంతో ఆయన ఏకాకిఅయి పోయాడు. ఉన్నతపదవులు సంపాదించి, ఐశ్వర్యవంతులం కావాలనే దుర్బుద్ధితో వారంతా రాజీఅనీ 'సామరస్యం' 'ఐకమత్యం' అని ఎక్కడలేని ఒత్తిడి తే నారంభించారు.

1911 విప్లవం విఫలమయిందని సన్-యేట్-సేన్ తరువాత ఒకసారి ఒప్పుకొన్నాడని అంటారు. ఒకవిధంగా ఆ విప్లవం నిరర్థకమయిందని అనవచ్చు కాని, ప్రపంచమంతటిలోను అతిపురాతనమైన నిరంకుశ రాజపాలనను కూలద్రోయడంలో అది జయప్రదమయింది. చైనా ప్రజలపై మంచూ చక్రవర్తులు బిగించిన సంకెళ్ళను ఆ

విప్లవం పటాపంచలు చేసింది. సామ్రాజ్యవాదానికీ, జమీందార్ విధానానికీ వ్యతిరేకంగా జాతీయస్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై సాగిన పోరాటంలో తొలివిజయం సాధించిన ప్రజాస్వామిక ఉద్యమంగా అది చైనాసామాజిక పరిణామ ఇతిహాసంలోను, ప్రపంచ సంస్కృతి చరిత్రలోనూ ఒక ప్రధానమైన స్థానాన్ని శాశ్వతంగా సంపాదించుకొంది.

ఉత్తర, దక్షిణ ప్రభుత్వాలమధ్య సంధి జరిగింది. చైనా 'ఏకీకృత'మయింది. ఇక సైన్యంలోంచి తనను తొలగించవలసిందిగా మావో-సే-టుంగ్ అర్జీపెట్టుకున్నాడు. ఆ విషయం తెలిసీ తెలియడంతోనే తనపటాలంలోని సైనికులూ, సైనికోద్యోగులూ అతనిచుట్టూ చేరి, సేనలోనే ఉండమని నచ్చజెప్పబోయారు. "నువ్వు చాలా అభివృద్ధిలోకి వస్తా"వని అన్నారు. అంటే పెద్దపదవులు సంపాదించి, బాగా డబ్బుగడించవచ్చుననే వారిఉద్దేశం. కాని మావో-సే-టుంగ్ తన అభిప్రాయం మార్చుకోలేదు. సైన్యాన్ని విడిచిపెట్టి తిరిగి తన చదువు ప్రారంభించాడు. ఇంచుమించు అదేసమయంలో ఆయన, సామాన్యమైన సాంఘికసేవా కార్యక్రమాల్లో పాల్గొన నారంభించాడు.

# వంటరిగా చాంగ్షాలో అగచాట్లు

విద్యాభ్యాసాన్ని తిరిగి కొనసాగించేందుకు నిశ్చయించుకున్న మావో-సే-టుంగ్, పత్రికలలో పాఠశాలల ప్రకటనలను శ్రద్ధగా పరిశీలించ నారంభించాడు. నానారకాల పాఠశాలల ప్రకటనలు కనుపించేవి. పోలీసు ఉద్యోగుల తరిఫీదుకు, సబ్బుపరిశ్రమలో శిక్షణకు పాఠశాలలు; న్యాయశాస్త్ర, వాణిజ్యశాస్త్ర పాఠశాలలు - ఈ విధంగా వివిధ పాఠశాలలు, మావో-సే-టుంగ్ లాంటి యువకులను ఆకర్షించేలా తమప్రకటనలు పత్రికలలో ప్రచురిస్తుండేవి. మావో-సే-టుంగ్, అమాయికంగా అయిదారు పాఠశాలలకు ఒక్కొక్క డాలరుచొప్పున దరఖాస్తు రుసుంకట్టాడు. పత్రికలలోని ప్రకటనలే కాకుండా ఆయన స్నేహితుల ప్రోద్బలంకూడా ఇందుకు కొంతకారణం.

కొన్నాళ్ళు మావో-సే-టుంగ్ సబ్బులు తయారుచేయడం నేర్చుకుందా మనుకున్నాడు. ఆవిధంగా దేశంలో ఒకకొత్తపరిశ్రమను పెంపొందించేందుకు, ప్రజలకు మేలుచేసేందుకు ఉపయోగపడగల ననుకున్నాడు. తరువాత, న్యాయవాదివృత్తి జడ్జిపదవి అతనిదృష్టిని ఆకర్షించాయి. అదంతాకాదు. ఆర్థికశాస్త్రాన్ని అధ్యయనంచేస్తే దేశానికి ఎక్కువ ఉపయోగపడగలనేమో అనుకున్నాడు. చివరకు ఒక వాణిజ్యశాస్త్ర పాఠశాలలో చేరాడు. అదొక రాష్ట్రపాఠశాల. ఉపాధ్యాయులు సమర్థులైనవారు; బోధనాక్రమంకూడ చక్కనిది.

ఆ పాఠశాలకు దరఖాస్తు పెట్టుకున్నప్పుడే, తన తండ్రికికూడా ఆ విషయం తెలియజేశాడు. తండ్రి సంతోషంతో అందుకు అంగీకరించాడు. తనకొడుకు వర్తకంలో ప్రవేశించడమేకదా మొదటి నుంచీ అతనికోరిక. చాలకాలం క్రిందటే, ఒక బియ్యం కొట్టులో తరిఫీదు నిప్పించేందుకు తాను ప్రయత్నించలేదా? అప్పుడంతా విన్నాడుకాదు - పోనీ ఇప్పుడైనా తనకొడుకు దారికివస్తున్నందుకు సంతోషించాడు తండ్రి. ఆరోజుల్లో పాఠశాలల్లో ఎక్కువవిషయాలు ఇంగ్లీషులోనే బోధించడం మామూలు. మావో-సే-టుంగ్ చేరిన పాఠశాలలోకూడా అదేపద్ధతి. చాలమంది తక్కిన విద్యార్థుల్లాగానే మావో-సే-టుంగ్‌కి ఇంగ్లీషు అంత బాగారాదు. ఇక లాభంలేదనుకొని, ఒకనెల తరువాత అక్కడ మానివేశాడు.

మళ్ళా పత్రికలలో ప్రకటనలను చూచాడు. రాష్ట్ర ప్రథమ సెకండరీ పాఠశాలకు దరఖాస్తు పెట్టుకున్నాడు. ప్రవేశ పరీక్షలో మావో-సే-టుంగ్ ప్రథముడుగా ఉత్తీర్ణుడయాడు. హెడ్‌మాస్టరుతోసహా, ఉపాధ్యాయులందరికీ అతనంటే ఎంతో అభిమానం ఏర్పడింది. ఆ పరీక్ష సందర్భంలో మావో-సే-టుంగ్ రాసిన వ్యాసం అతని స్వంతం కాదేమో అన్న అనుమానం వారికి కలిగింది. మళ్ళా ఒక ప్రశ్న ఇచ్చి, దానికి ఆయన జవాబు రాస్తున్నప్పుడు దగ్గరే కూర్చున్నారు. తన శక్తి సామర్థ్యాలను ఆయన రెండవసారి కూడా చూపించాడు. ఉపాధ్యాయులంతా ముగ్ధులయారు. సంతోషంతో అతనిని తమపాఠశాలలో చేర్చుకున్నారు. కాని, మావో-సే-టుంగ్‌కి ఆ పాఠశాలమీద కొద్ది రోజుల్లోనే అసంతృప్తి కలిగింది. అక్కడ పాఠ్యవిషయాలు చాల పరిమితమని ఏఒక్క విషయంలోనూ సమగ్రబోధన లేనేలేదని తెలుసుకున్నాడు. అలా, అసంతృప్తితోనే అక్కడ ఆరుమాసాలు గడిపాడు.

ఆ పాఠశాలలోని ఒక చైనా భాష అధ్యాపకుడు మాత్రం మావో-సే-టుంగ్‌కి ఎంతో తోడ్పడ్డాడు. సారస్వతం అంటే మావో-సే-టుంగ్‌కి గల అభిరుచిని గుర్తించి, ఆ ఉపాధ్యాయుడు, 'చరిత్ర దర్పణం' అనే గ్రంథ సంపుటాలను, చదివి ఇమ్మని అతని కిచ్చాడు. ఆ గ్రంథాలు మావో-సే-టుంగ్‌ని ఎంతో ఆకర్షించాయి. స్వయంకృషితో చదివి, అధ్యయనం చేయగలుగుతే, సాధారణంగా పాఠశాలల్లో పొందేదానికన్నా ఇంకా ఎక్కువ విజ్ఞానాన్ని సముపార్జించగలనన్న నిర్ణయానికి మావో-సే-టుంగ్ క్రమక్రమముగా వచ్చాడు. ఆ నిర్ణయం ప్రకారం, తనంతటతాను చదివి విషయాలు తెలుసుకునేందుకు ఒక ప్రణాళిక తయారు చేసుకున్నాడు.

## స్వయంబోధన

టింగ్-వాంగ్-టాయ్ అనేది చాంగ్షా నగరంలో ఒక చిన్న గుట్ట. ఏమంత ఎత్తయినదికాదు. ఆ పైనుంచి నగర దృశ్యంకూడా పూర్తిగా కనబడదు. ఆ గుట్టమీద ఒక భవనం ఉంది. దానినొక గ్రంథాలయంగా మార్చారు. హునాన్ రాష్ట్రంలో ప్రథమ రాష్ట్రీయ గ్రంథాలయమది. అందులో చైనా భాషలోను, విదేశీ భాషల్లోను అనేక గ్రంథాలుండేవి. కొత్తగా తెరవడంవల్ల, ఎక్కువ మంది అక్కడికి రావడానికి అప్పటి కింకా అలవాటు పడలేదు.

ఎవరు వచ్చినా రాకపోయినా, ఒక యువకుడు మాత్రం ప్రతిరోజూ తప్పనిసరిగా హాజరయేవాడు. సరిగ్గా, గ్రంథాలయ తలుపులు తెరిచే సమయానికి, ఆయన అక్కడికి చేరుకునేవాడు. పొడవుగా, సామాన్య దుస్తులు ధరించి, ఠీవిగా, నెమ్మదిగా నడుస్తూ ఆయన లోపలికి వచ్చేవాడు. తనకు కావలసిన పుస్తకం తీసుకొని

పఠన మందిరంలో ఒక టేబుల్ వద్ద కూర్చొని, చదవడం ప్రారంభించేవాడు. అంతే - మళ్ళా గ్రంథాలయం తలుపులుమూసే వేళ వరకు, విరామంలేకుండా ఆ చదువు అలా సాగవలసిందే. ఎండైనా, వానైనా ప్రతినిత్యం అదే కార్యక్రమం. అతను మరెవరోకాదు. మన మావో-సే-టుంగే. ఆయన అసాధారణమైన ఏకాగ్రతతో చదివేవాడు. మధ్యాహ్నంపూట, భోజనంవేళ, ఏదో కొంత తిని రావడానికి మాత్రం కొద్ది నిమిషాలు ఆ చదువు ఆపేవాడు.

గ్రంథాలయంలో అడుగుపెట్టగానే, "కాయగూరల తోటలో పడిన ఎద్దులాగా ఉండేది నా పరిస్థితి" అని ఆయనే అప్పటి విషయాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఒకసారి అన్నారు. కనబడ్డ ప్రతిపుస్తకం చదివేసి జీర్ణించుకొనేవాడు. చైనా ప్రాచీన కావ్యాలు, చరిత్ర, తత్వశాస్త్ర గ్రంథాలూ, కాల్పనిక గ్రంథాలూ, విదేశాల చరిత్ర, భూగోళం, తత్వశాస్త్రం, సారస్వతం అన్నీ చదివేవాడు. చైనా భాషలోకి తర్జుమా అయిన ఏ ప్రసిద్ధ గ్రంథాన్నీ ఆయన విడిచిపెట్ట లేదంటే అతిశయోక్తి కాదు. అలా ఆయన చదివిన వాటిలో, ఆడం స్మిత్ రచించిన 'జాతుల సంపద', డార్విన్ 'పరిణామ సిద్ధాంతం', థామస్ హక్స్లే రాసిన 'పరిణామము — నైతిక సూత్రాలు', జె. యస్. మిల్ గారి తర్కశాస్త్రం, హెర్బర్టుస్పెన్సర్ రచించిన "సాంఘిక శాస్త్ర పరిశీలన", మాంటెస్క్యూ రచించిన 'న్యాయశాస్త్ర తత్వం", జీన్ జాక్వెస్ రూసో రచనలు, ప్రాచీన గ్రీకు రోమన్ కావ్యాలు ముఖ్యమైనవి.

ఆ గ్రంథాలయంలోని పెద్ద ప్రపంచ పటం కూడా మావో-సే-టుంగ్ దృష్టిని ఆకర్షించింది. అటు ప్రక్క ఎప్పుడు వెళ్ళినా, కొంతసేపు నిలిచి, జాగ్రత్తగా పరిశీలించి మరీ వెళ్ళేవాడు.

ఆ విధంగా రోజంతా గ్రంథాలయంలో గడిపి, సాయంత్రం తిన్నగా తన వసతికి చేరేవాడు. విధి విరామంలేని యీ స్వయం బోధనా కార్యక్రమంతో మావో-సే-టుంగ్ ఇంచుమించు ఆరు మాసాలు గడిపాడు. ఆ స్వల్పకాలంలో ఆయన ఎంతో విజ్ఞానాన్ని జీవితంలో పనికివచ్చే విషయపరిజ్ఞానాన్ని సమకూర్చుకోగలిగాడు. తన జీవితం అంతటిలోను, అత్యాంత విలువైన ఘట్టాల్లో ఒకటిగా ఆ ఆరుమాసాలను మావో-సే-టుంగ్ పరిగణిస్తాడు.

తన కుటుంబంవారికి మాత్రం అదంతా చదువు సాములూ, ఉద్యోగ సద్యోగాలూ లేకుండా తిరుగుతున్నట్లు కనుపించింది. అది వారి కే మాత్రం నచ్చలేదు. అతనికి డబ్బు పంపడం మానివేశారు. చేతిలోఉన్న పైకంకాస్తా అయిపోవచ్చింది. అదివరకు ఉన్న చోట ఉండడం ఇకఅసాధ్యమయింది. మరెక్కడైనా ఉండేందుకు అవకాశం దొరుకుతుందేమో అని వెతకనారంభించాడు. ఏదైనా ఉపాధ్యాయ పదవిదొరికితే బాగుండుననిపించింది. ఒకనాడు ఈ దిగువ ప్రకటన, ఒక పత్రికలో కనుపించింది.

> హూనాన్ రాష్ట్రంలో ప్రథమ ఉపాధ్యాయ శిక్షణా పాఠశాల: బోధన, భోజనం ఉచితం. ఉత్తీర్ణులయిన తరువాత విద్యాబోధనకార్యక్రమం. విద్యయే దేశసౌభాగ్యానికి పునాది...

ఈ ప్రకటన చూడగానే మావో-సే-టుంగ్ పరమానంద భరితుడయాడు. అందులో చేరదలచుకున్నానని ఇంటికి జాబు రాశాడు. అక్కడ నుంచి సంతోషకరమయిన జవాబు వచ్చింది. ఆపాఠశాలలో ప్రవేశపరీక్షకు హాజరయాడు. అర్హతను నిరూపించుకొని చేర్చుకోబడ్డాడు.

# బహుముఖ పరిజ్ఞానం.

ఆ పాఠశాల, చాంగ్షానగరపు దక్షిణద్వారం వెలుపల మియావో-కావో-ఫెంగ్ కొండదగ్గర ఉండేది. చైనా భావిభాగ్య విధాత మావో-సే-టుంగ్, ఆ పాఠశాలలో అయిదేళ్ళవిద్యాభ్యాసం చేసి పట్టభద్రుడయ్యాడు. ఆ అయిదేళ్ళలో ఆయన తన విజ్ఞానాన్ని ఎన్నోరెట్లు పెంచుకున్నాడు. ప్రజాసంఘాల కార్యకలాపాలలో ఆయన తొలి అనుభవం కూడా అక్కడే. ఆయన రాజకీయ దృక్పథం సునిశితమై, ఒక నిర్దిష్టస్వరూపం పొందనారంభించింది. అంతేకాదు. ప్రజలను సంఘటితపరచటంలో ఆయన ఉపజ్ఞ, ప్రజానాయకునిగా ఆయన విశిష్టత ఆరోజుల్లోనే ప్రస్ఫుటం కాజొచ్చాయి. ఆనాడు, ఆ పాఠశాలలో తాను సమీకరించి, సంఘటితపరచిన సోదర విద్యార్థులలో అనేకులు, ముందుముందు విప్లవోద్యమానికి వెన్నెముకగా రాణించారు.

మావో-సే-టుంగ్‌ని చేర్చుకున్నది 'ఇ' తరగతిలో. కష్టపడి పనిచేసే తనసహజ సాంప్రదాయాన్ని అక్కడకూడా కొనసాగించాడు. తన స్వయంబోధనా కార్యక్రమాన్ని మానలేదు. విధి విరామం లేకుండా గ్రంథపఠన సాగించేవాడు. ఆయన శక్తిసామర్థ్యాలు విద్యాభ్యాసంపట్లగల దీక్ష, నిష్కాపట్యం, నమ్రత, సత్ప్రవర్తన, పాఠశాలలో అందరి మెప్పును చూరగొన్నాయి. ఆయన వ్యాసం రాసినప్పుడల్లా, ఆ పాఠశాలలో ఒక గొప్పసంఘటన జరిగినట్లుగా ఉండేది. ఆయన రాసిన ప్రతివ్యాసాన్నీ ఉపాధ్యాయులే తీసుకువెళ్ళి పాఠశాల ఉన్నతాధికారి ఆఫీసుకి ఎదురుగా ఒక పలకకు అంటించేవారు. పాఠశాలలో పాఠాలయిపోయినతరువాత ప్రతివారూవచ్చి వాటిని చదివేవారు.

తనకున్న ప్రజ్ఞతో మావో-సే టుంగ్ ఎప్పుడూ సంతృప్తి పడలేదు. తనపై కురిసిన ప్రశంసలు ఆయనలో స్వాతిశయం పెరగలేదు. వ్యతిరేకమే జరిగింది. ఆయన విజ్ఞానతృష్ణ ద్విగుణీకృతమయింది. దీక్ష ఇనుమడించింది.

సాయంత్రం వేళ చదువుకునేందుకు విద్యార్థులకిచ్చే వ్యవధి మావో-సే-టుంగ్‌కి చాలేదికాదు. అందుచేత వసతిగృహానికి వెళ్ళిన తరువాతకూడా చదువుసాగించేవాడు. దీపాలన్నీ ఆర్పేయాలని హెచ్చరికగా బిగిల్ ఊదినతరువాతకూడా తన స్వంతదీపం ఒకటి వెలిగించి, ఒక వెదురుబొంగుకు తగిలించి, ప్రక్కమీద పడుకొని మరీచదివేవాడు. తరచుగా తెల్లవారుతుండేది.

మావో-సే-టుంగ్ క్లాసులకు క్రమం తప్పకుండా వెళ్ళేవాడు. అయినప్పటికీ, తన స్వంత అధ్యయనకార్యక్రమం విడవకుండా సాగించేవాడు. ఎప్పుడైనా ఏదైనా క్లిష్టసమస్య ఎదురైతే, స్కూలు కార్యక్రమంతో సహా అంతా మానుకొని, దానిమీదనే తనదృష్టి కేంద్రీకరించేవాడు. పాఠశాల కార్యక్రమంలో తక్కిన అంశాలకన్నా సాంఘిక శాస్త్రం అంటే ఆయనకు అభిరుచి ఎక్కువ. తక్కినవన్నీ జీవితంలో ఎందుకూ పనికిరానివిగా భావించేవాడు. ఆయన విషయంలో అది సహజమే. రాజకీయ, సామాజిక సమస్యలంటే మొదటినుంచీ ప్రత్యేక శ్రద్ధచూపుతూ వచ్చాడాయన.

కొన్నాళ్ళు ప్రకృతిశాస్త్రం అంటే ఆయన ఎక్కువ శ్రద్ధ చూపాడు. మార్క్సిజానికీ, ప్రకృతిశాస్త్రానికీ సంబంధంలేకుండా ఉండడం మంచిదికాదనే దృఢాభిప్రాయంతో ఆ శాస్త్రాలను అధ్యయనంచేశాడు. యేవిధంగా యేయేవిషయాల్లో ఆయనకాశ్రద్ధ పుట్టిడితే, వాటినల్లా వదలక ధ్యానంతో అధ్యయనంచేసేవాడు. అలాంటి

విషయాల్లో చైనా చరిత్ర ముఖ్యమైనది. ఒకసారి, చైనా చరిత్రనుగురించిన గ్రంధాలు పాతవి, కొత్తవి అన్నీ సేకరించి హకా గ్రతతో చదివాడు. తాను చదివిన ప్రతిగ్రంధంలోని ముఖ్యాంశాలు రాసుకోవడం ఆయనకు అలవాటు. పొంకమైన దస్తూరీతో, గంభీర మైన భావాలను కూర్చిన అలాంటి పుస్తకాలలో ఒక పెద్దపెట్టె నిండిపోయింది.

## "సుయె పెన్"-చదవాలి: తర్కించాలి

యాంగ్-హువాంగ్-చుంగ్ ఆ పాఠశాలలో పేరుమోసిన ఉపాధ్యాయుడు. మావో-సే-టుంగ్ మీదా, అతని సహాధ్యాయుల మీదా ఆయన ప్రభావం చాలాఉంది.

ఆయన చాంగ్షావాసి. జపానులో ఆరేళ్లు, ఇంగ్లాండులో నాలుగేళ్లు విద్యాభ్యాసం చేశాడు. అయినప్పటికీ సాంప్రదాయక చైనాతత్వ శాస్త్రంలో బాగా పాతుకుపోయాడు. సుంగ్ రాజుల నాటి తత్వశాస్త్రజ్ఞుల భావాలను ఇంకా విపులీకరించడం అంటే ఆయనకెంతో ఆనందం. కాంట్, స్పెన్సర్, రూసో మొదలైన విదేశ తత్వశాస్త్రజ్ఞులన్నా ఆయనకు చాల అభిమానం.

ఆ పాఠశాలలో ఆయన నీతి శాస్త్రం, తర్కం, మనస్తత్వ శాస్త్రం, విద్యాబోధన, తత్వ శాస్త్రాలను బోధించేవాడు. వక్తగా అతనేమీ రాణించేవాడుకాదు. అయినప్పటికీ వినేవారికి విసుగు పుట్టించేలక్షణాలేవీ లేవు. ఆయన చెబుతున్నంతసేపూ, భక్తి శ్రద్ధలతో వినేవారు. అంతులేని ఆయన విజ్ఞానతృష్ణ, ఆలోచనాపరులు, శ్రద్ధాళులైన యువకులను ఆతనిచుట్టూ ఆకర్షించేది. మావో-సే-

టుంగ్, సాయ్-హో-షెన్ * చెంగ్‌చాంగు వారిలో కొందరు తక్కినవాళ్ళతో పాటు ఆ ముగ్గురూ, ప్రతి ఆదివారం యాంగ్ హువాయ్-చాంగ్ ఇంటికివెళ్ళి అనేకవిషయాలు ఆయనతో చర్చించే వారు. ఆయన వాళ్ళను ఎంతో ఆప్యాయంగా చూచేవాడు. సంతోషంతో వాళ్ళకు కావలసినసహాయం అంతా అందజేసేవాడు; అవసరమైన సలహాలన్నీ ఇచ్చేవాడు.

చరిత్ర, సారస్వతంతో పాటు, తత్వశాస్త్రమన్నా మావో-సే-టుంగ్‌కి ఎంతో అభిరుచి. అమిత ఉత్సాహంతో దానిని అధ్యయనం చేశాడు. ఎప్పటికప్పుడు క్రొత్తవిషయాలను తెలుసుకొనేందుకు మావో-సే-టుంగ్ సాగించిన కృషి అనంతం. ఆ పాఠశాలలో ఉన్నంతకాలం పాఠ్యవిషయాలతో పాటు, తనస్వంత అధ్యయన కార్యక్రమం, ఉపాధ్యాయులతో చర్చలు నిరంతరం సాగించేవాడు. అంతేకాదు. చాంగ్షా నగరానికి, వచ్చే ప్రతి పండితుడిని దర్శించి, వారుచెప్పే ప్రతి విషయాన్నీ శ్రద్ధతో వినేవాడు. వారిపట్ల వినయ విధేయతలు గల విద్యార్థిగానే సర్వదా వ్యవహరించేవాడు. వారితో సంభాషణ పూర్తికాగానే, వారుచెప్పిన విషయాలను వాటిని

* సాయ్-హో-షెన్, ఆ పాఠశాలలో మావో-సే-టుంగ్ ముఖ్యస్నేహితులలో ఒకడు. సియాంగ్‌సియాంగ్ నివాసి అయిన అతను చాల బీదవాడు. కాని, విజ్ఞానతృష్ణ అపారం. తరువాత ఫ్రాన్సువెళ్ళి అక్కడ చైనా కూలీలను, విద్యార్థులను కమ్యూనిస్టుసంఘాలుగ్గ నిర్మించాడు. చైనాకు తిరిగివచ్చినతరువాత, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ తరఫున ప్రచారకార్యక్రమం సాగించాడు. సమర్థులైన విప్లవనాయకులలో ఒకడనిపించుకున్నాడు. 1931 లో అతనిని హాంకాంగులో బ్రిటిషువారు అరెస్టుచేసి, కాంటన్ తీసుకువెళ్ళి, విప్లవవ్యతిరేక నరహంతకులకు వప్పగించారు. వారతనిని ఒక గోడకు వ్రేలాడగట్టి, ఛాతీని సన్నీలతో తూట్లు పొడిచి, చితుకగొట్టి చంపారు.

గురించి ఆ వ్యక్తినిగురించి తన విమర్శనను మిత్రులకందరికీ తెలిపే వాడు. చాంగ్షాలోని 'చువాన్‌షాన్ సొసైటీకి' మావో-సే-టుంగు తరుచు వెళ్ళేవాడు. మింగ్ రాజులనాటి మహాతాత్వికుడు వాంగ్-చువాన్-షాన్ యొక్క బోధలను గురించి అక్కడ ప్రతి ఆదివారం ఉపన్యాసాలు జరుగుతుండేవి. ముఖ్యంగా ఆ మహాతాత్వికుని దేశ భక్తి ప్రదీపక ఉపదేశాలు మావో-సే-టుంగ్‌ని ఆకర్షించాయి.

"సుయె-వెన్ (విజ్ఞానం) అనే మాట చాల ముఖ్యమైన పద సమ్మేళనం" అని మావో-సే-టుంగ్ అనేవాడు. "సుయె (అధ్యయనం), వెన్ (తర్కించడం) అనే ఈ రెండు మాటల సంబంధం అవినాభావం" అని వివరించేవాడు.

## ఆతపాది స్నానాభ్యాసం

యాంగ్-హువాయ్ చుంగ్ ప్రభావం విద్యార్థుల చదువుకు సంబంధించినంతవరకే కాదు; వారి దైనందిన జీవిత విధానాలమీద కూడా ప్రసరించింది. అవినీతికరమైన జమీందారీ జీతవిపద్ధతులంటే ఆయనకు ఎక్కడలేని రోత. నూతన ప్రజాతంత్ర, శాస్త్రీయ పద్ధతులతో ప్రజల నిత్యజీవనం సాగాలని ఆయన అభిలాష. ఉదయం అల్పాహారం కూడదనీ, ప్రాణాయామం, ధ్యానం ప్రతినిత్యం ఆచరించాలనీ అన్ని వేళల్లోనూ, అన్ని ఋతువుల్లోనూ చన్నీళ్ళ స్నానమే మంచిదనీ ఆయన పట్టుదల. యువకులకు సహజమైన ఉత్సాహంతో మావో-సే-టుంగ్, సాయ్-హో-షెన్, తదితరులు అక్షరాల ఆయనను అనుసరించ నారంభించారు. రెండేళ్ళు ఉదయం అల్పాహారాన్ని పూర్తిగా విసర్జించారు.

ఒక ఏడు, వేసవిసెలవుల్లో మావో, సాయ్, చాంగ్ కున్-టి అనే మరొక మిత్రుడు కలిసి, చాంగ్షా నగరానికి ఎదురుగా, నదిగట్టున

నున్న యుయెలు కొండమీద ఒక చిన్న కుటీరం అద్దెకు తీసుకు
న్నారు. అక్కడ ఉదయం అల్పాహారమే కాకుండా, రాత్రి భోజనం
కూడా మానివేశారు. ఆహారం తీసుకొన్న ఒక్క పూట కూడా
ఎక్కువగా పెద్ద చిక్కుళ్ళు తినేవారు. వారిలో ఎవరిదగ్గరా ఎక్కువ
డబ్బులేకపోవడం కూడా ఇందుకొక కారణం. ఉదయాన్నే కొండ
శిఖరంమీదికి పోయి ధ్యానంలో కూర్చొనేవారు. తరువాత కిందికి
వచ్చి అక్కడి కొలనులోనో, నదిలోనో స్నానం చేసేవారు. సెల
వులు పూర్తి అయేవరకు ఇది సాగింది. నిష్ఠతో కూడిన ఈ కార్య
క్రమాన్ని పూర్తి విశ్వాసంతో కొనసాగించారు.

స్నానానికి అనేక రూపాలు కల్పించారు. తరుచు పూర్తిగా
దిగంబరులై తమ శరీరాలను మండుటెండల్లో ఎండబెట్టేవారు, గాలి
పారనిచ్చేవారు, వర్షాల్లో తడిపి ముద్దచేసేవారు. ఆనాటి ముచ్చట్లను
చెబుతూ, ఒకసారి మావో-సే-టుంగ్ వాటికి ఆతపస్నానం, వర్ష
స్నానం, వాయుస్నానం అని సరదాగా నామకరణం చేశాడు.
సియాంగ్ నదిలోని ఒక చిన్న లంకకుకూడా తరుచువెళ్ళేవారు.
ఈదడానికి అదిచాల అనుకూలమైనచోటు. అక్కడ గంటలతరబడి
ఈదేవారు. తాము వజ్రకాయులం కావాలనే దీక్షతో దానికిదే
మార్గమన్న నమ్మకంతో ఆ కార్యక్రమాన్ని కొనసాగించారు. గళ
సాధనకూడా వారి కార్యక్రమంలో ఒక భాగం. కొండలమీదికిపోయి
గట్టిగా అరుస్తూ పాటలూ, పద్యాలూ చదివేవారు. లేకపోతే నగర
ప్రాకారాలెక్కి, ఊపిరితిత్తులనిండా గాలిపీల్చి, గాలివాటుకి ఎదురు
తిరిగి గొంతుపగిలేలా అరిచేవారు.

కొన్నివిషయాల్లో ఆ పద్ధతులు నేటి ఆధునిక పద్ధతులకు సరి
పోవడం చిత్రమైన విషయం. శరీరానికి ఎండా, శుభ్రమైన గాలీపట్టిం
చడం, నీటిజల్లులోస్నానం (షవర్ బాత్) శ్రేష్ఠమనేకదా నేటివాదన?

ఆ కొండమీద కుటీరంలో ఉన్నంతకాలం వారిలో ఒక్కొక్క రికి ఒక తువ్వాలు, ఒకగొడుగు, కొద్దిబట్టలు మాత్రమే ఉండేవి. మావో-సే-టుంగ్ ఎప్పుడూ ఒక నిడుపాటి, బూడిదరంగు జుబ్బా తొడిగేవాడు. తక్కినవారి దుస్తులకు అది భిన్నంగా ఉండేది.

రాత్రిళ్ళు, ఆరుబయట ఒక మైదానంలో పండుకొనేవారు. పరిశుభ్రమైన గాలికేమీ కొరతలేకుండా ఉండడంకోసం ఒకరికొకరు చాలాదూరంగా పండుకునేవారు. సెలవలు తరువాత పాఠశాలకు తిరిగివెళ్ళినప్పుడుకూడా ఈ పద్ధతినే అనుసరించేవారు. చలికాలంవచ్చే వరకు ఆటలమైదానంలో పండుకొనేవారు.

ఆనాటి అనుభవాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ, మావో-సే-టుంగ్ ఒకసారి, తన డైరీలో ఇలారాశాడు:

మన్నుతో పోరాట మెంత హాయి
మిన్నుతో పోరాట మెంత హాయి

1920-1921 లో మావో-సే-టుంగ్ 'ఆదివారం క్లబ్బు' నొకదానిని ఏర్పాటుచేశాడు. ఈ క్లబ్బులో అందరూ ప్రతి ఆదివారం సమావేశమయేవారు. చాంగ్షానగరం సివారుల్లో, ప్రకృతి సౌందర్యానికి పేరుపొందిన ప్రదేశాలను సరదాగా వెళ్ళివచ్చేవారు. ఒకసారి నడిహేమంతంలో, సియాంగ్ నదిమీద, పడవల్లో వెన్నెల విహారం బయలుదేరారు. మరునాడు వేకువజామువరకు ఇల్లు చేరుకోలేదు. ఆ నదిలోఉన్న 'నారింజదీవి'ని చుట్టుకొని, హాయిగా విహరించి తిరిగి వచ్చారు. ఆనాటి అనుభవాన్ని వర్ణిస్తూ, మావో-సే-టుంగ్ ఒకగేయం రాశాడు. కవిగా ఆయన ప్రజ్ఞను, సాహిత్యంలో ఆయన స్థానాన్ని నిరూపించగల రచన అది. ఆయన ఊహాశక్తికి, ప్రగాఢమైన సానుభూతికి, మహోన్నత భావాలకు అది ప్రతిబింబం. ఇదీ ఆ పాట.

## పాట :

ఉత్తరవాహిని హీసియాంగు నది
నదిలో నారింజల దీవున్నది
దీవిలోన పదివేల గుట్టలూ
గుట్టలపై కెంపెక్కిన చెట్టులు
జాలువారు పచ్చల నీరమ్ములు
నీళ్ళల్లో పడవల పందెమ్ములు
గరుడపక్షి గరిడీలు నింగిలో
గండు మీల బురిడీలు గంగలో
ప్రాణశక్తి బహురూప ధారియై
స్వేచ్ఛకోరకు చేసే విజృంభణ
వీక్షించాడే కాకినియై
శిశిరకాల శీతల దివసమ్మున
ఈ యనంత ధాత్రీతల మందున
జీవకోటి శాసించే దెవ్వరు
అని ప్రశ్నించితి నా కుటీర వా
తాయనమ్ము నుత్పాటవమొనర్చి;

♦ ♦

తిరిగి మిత్రులెందరినో తోడ్కొని
ఈ స్థలాన్ని దర్శించిన యప్పుడు
ఎడదలోన ఆ గడచిన రోజుల
ఉజ్వల స్మృతులు ముప్పిరిగొన్నవి
తరుణ వయస్కు లుదార మనస్కులు
తోటివారు ఆనాటి వయస్యులు.
విరామ మెరుగని కరాలు – ముత్తెపు

సరాలు మా అక్షరాలు - ఊహాలు
నిరాటంక నిర్ఝర నివహమ్ములు
శిరీషసుమ కేసర పేశలములు
హృదయంలో నిద్రించిన కళలను
కుదిపి మేల్కొలుపు కొండలు అవిగో
అంగోనది! అల్లవిగో నావలు!
పరిహసించుచున్నది పకపకమని
పాతయుగపు పరిపాలకులను గని!
గలగలమను కెరటాలపైన ఊ
యలల నూగుతూ తేలియాడుతూ
ముందుకు దూసుకు పోయే పడవ
సందును మరిచావా ఓ నేస్తం!
మననేకా జీవనము సమస్తం!

## బైరాగి పండితుడు - సామాజిక పరిస్థితుల పరిశీలన ప్రారంభం

ఒక ఏడాది వేసవి సెలవుల్లో, మావో-సే-టుంగ్, హూనాన్ రాష్ట్రంలోని వివిధ తాలూకాల సంచారానికి బయలుదేరాడు. చాంగ్షానుంచి బయలుదేరి కాలినడకనే నింగ్ సియాంగ్, పింగ్ చియాంగ్, లియు యాంగ్ మొదలైన అయిదుతాలూకాలు పూర్తిగా తిరిగివచ్చాడు. బయలుదేరినప్పుడు జేబులో చిల్లిగవ్వకూడా లేదు. పాతపద్ధతులను కొత్త ప్రయోజనాలకు ఉపయోగించడంలో సమర్థుడైన మావో-సే-టుంగ్, ఆయా ప్రదేశాల్లో దండకవివలె రాసిపెట్టి, దారివెచ్చం సంపాదించుకొనేవాడు. అది అంత నమ్మకో తగిన పద్ధతికాదని తెలుసు. కాని, దానివల్ల గ్రామసీమలో విస్తారంగా

సంచారం చేయగల అవకాశం లభించింది. రైతు జీవనాన్ని, వారి ఆచారాలను, అలవాట్లను పరిశీలించి, అవగాహన చేసుకోగలిగాడు. ఆయన ఆలోచనల్లో నిరంతరం మసలుతూండిన సమస్యే ఈ రైతు సమస్య.

మరొకసారి వేసవి సెలవుల్లోనే, తానూ, సాయ్-హో-షెన్ కలిసి, టుంగ్ టింగ్ సరస్సు చుట్టూ ఉన్న సియాంగ్ యిన్, యియాంగ్, యు-యె-చౌ ప్రాంతాల్లో పర్యటించాడు. చాంగ్షానగరం వెలుపల నున్న యు యెలు పర్వతపాదంవద్ద, యున్ హాన్ ఆలయ ప్రాంగణం లోంచి వారిద్దరూ బయలుదేరారు. చిరిగిన గొడుగు, తువ్వాలు, చెప్పులజత తప్ప వారివద్ద మరేమీ లేవు. సాయ్ హో-షెన్ తనతల్లి తోనూ, చెల్లెలు సాయ్ చాంగ్ (ఇప్పుడు అఖిల చైనా ప్రజాతంత్ర మహిళా సమాఖ్య అధ్యక్షురాలు) తోనూ, రెండుమూడు రోజుల్లో తిరిగి వచ్చేస్తానని చెప్పి బయలుదేరాడు. కాని, వారిద్దరూ తిరిగివచ్చేసరికి రెండుమాసాలు దాటింది.

తిరిగిరాగానే వారిద్దరూ, యుయెలు కొండప్రక్కనున్న సాయ్ కుటుంబం ఇంటికి వెళ్లారు. దారిపొడుగునా దేవాలయాల్లోని సన్యాసులతో తాముజరిపిన సంభాషణలను గురించి, అక్కడక్కడ, దండకవిలె రాసి ఖర్చుకు డబ్బు సంపాదించిన విధం అంతా పూసగుచ్చినట్లు వర్ణించిచెప్పారు.

గ్రామాల్లో రైతులు వారిని మొదట అనుమానంగా చూచారు. చూడ్డానికివారు బైరాగి పండితుల్లాగా లేరు. బహుశా జ్యోతిష్కులేనేమో అని కొందరనుకున్నారు కాని, మాటామంతీ ప్రారంభ మయి అనడంలో వారిని తనవాళ్లలాగా చూడ నారంభించేవారు. ఎంతో ఆదరంతో చూచేవారు. మావో సే-టుంగ్, సాయ్-హో-షెన్, దారిపొడుగునా ప్రతి గ్రామంలోనూ, అక్కడి ఆచార వ్యవ

హారాలను అడిగి తెలుసుకొనేవారు. రైతుజీవనాన్ని గురించిన శిస్తు విషయాలు, భూస్వామి-కౌలుదారు సంబంధాలు, రైతు దారి ద్ర్యము నిస్సహాయత గురించి పరిశీలించి అంతా తెలుసుకొనేవారు. అక్కడక్కడ రైతులే వారికి భోజనం, బస ఏర్పాటు చేసేవారు. కాని, తరుచు ఆరుబయటే నిద్ర; అను అలమే తిండి.

## రాజకీయ శాస్త్రీయ దృక్పథం

మావో-సే-టుంగ్ చదువుతూన్న పాఠశాలలో, విద్యార్థులు సాయంత్రం వేళ చదువుకొనేందుకు ప్రత్యేకంగా ఒక మందిరం కేటాయించారు. సాయంత్రం వేళ దీపాలకాంతితో ఆ రెండతస్తుల భవనం దేదీప్యమానంగా వెలిగిపోయేది. తమ పాఠ్య గ్రంథాల్లోని భాగాలను పఠించే కార్యక్రమంలో తక్కిన విద్యార్థులంతా నిమగ్నులై ఉన్నప్పుడు, మావో-సే-టుంగ్ ఒకమూల కూర్చుని పత్రికలు తిరగవేస్తూ ఉండేవాడు. దేశంలోనూ, విదేశాల్లోనూ జరుగుతూన్న రాజకీయ, సైనిక సంఘటనలను శ్రద్ధగా చదివేవాడు. దేశ, విదేశ వ్యవహారాలన్ని అప్పటికే ఆయనకు కరతలామలకం. చక్కని, పరిశీలనా దృష్టితో, ఏవిషయాన్నయినా వివరించి చెప్పగలిగేవాడు.

అవి మొదటి ప్రపంచయుద్ధం రోజులు. ఆయన ప్రపంచ పరిస్థితులను గురించి చెబుతూంటే, రాజకీయ, సైనిక వ్యవహారాలను గురించి వారం వారం అధికారులిచ్చే నివేదికలా అన్నంత శ్రద్ధగా వినేవారు విద్యార్థులంతా. సిరాజివో నగరంలో ఆస్ట్రియా-హంగరీ సామ్రాజ్య యువరాజు హత్య, జర్మన్ చక్రవర్తి కైజర్ సర్వసైన్య సమీకరణ ప్రారంభించడం, జర్మని రష్యాదేశాలమధ్య యుద్ధప్రకటన, ఫ్రాన్సు జర్మనీలను పోరు, బ్రిటనుపై జర్మనీ, కయ్యాం వెర్డునేవద్ద జరిగిన ఘోర సంగ్రామం, ఈ అదను చూచుకొని

చైనాను తన పాదాక్రాంతం చేసుకోనేందుకు జపాను 21 షరతులను రుద్దడం-ఇవన్నీ, ఇంకా అనేకంవివరించిచెప్పేవాడుమావో-సే-టుంగ్.

మిత్రులు సంతోషంపెట్టలేక "చక్కనివిమర్శనాదృష్టి నీకున్న దయ్యా. మేమూ పత్రికలు చదువుతున్నాం. కాని, నీవు అర్థంచేసు కున్నట్టుగా మేము అర్థంచేసుకోలేక పోతున్నాం" అని మెచ్చు కునేవారు.

అప్పటికే మావో - సే - టుంగ్‌కి రాజకీయదృష్టి ప్రగాఢ మయింది. ప్రతివిషయంలోనూ శాస్త్రీయంగా వ్యవహరించేవాడు. సవిమర్శక పరిశీలన, క్రోడీకరణ, సూత్రీకరణ, హేతువాదం అంటే ఆయనకెంతో అభిరుచి. నాటిప్రపంచ పరిస్థితులను తనతోటి విద్యార్థు లతో చర్చించేటప్పుడు చైనాతోనే వాటికి పోలికలు చూపేవాడు. చైనాచరిత్రతోను, చైనాలోని ఆనాటి సంక్షోభంతోను వాటికిగల సంబంధాన్ని వివరించేవాడు.

ఆపాఠశాల రెండేరెండు పత్రికలను చందాకట్టింది. ఒకటి షాంగ్‌హైనుండి, రెండవది చాంగ్షానుండి వెలువడేవి. అక్కడున్న విద్యార్థులకందరికీ ఆరెండూ చాలేవికావు. ఎప్పుడూ ఎవరో ఒకరు చదువుతూనే ఉండేవారు. అందుచేత మావో-సే-టుంగ్ స్వయంగా ఒక పత్రికకు చందాకట్టాడు. క్షుణ్ణంగా చదివినతరువాత, ఆ పత్రిక తెల్లని అంచులనుచింపి, వాటిని కలిపి కుట్టేవాడు. పత్రికల్లో తాను చదివిన ఆయాప్రదేశాల పేరులను, ఆ చిడుపాటి కాగితంముక్కల మీద రాసేవాడు. తరువాత ప్రపంచ పటాన్నిచూచి, వాటిపేరు లను ఇంగ్లీషులో, ఆప్రక్కనే రాసేవాడు.

"ఏమిటయ్యా నువ్వుచేస్తున్నపని?" అని మిత్రులు అప్పు డప్పుడు అడిగేవారు.

"ఇంగ్లీషు రాయడం నేర్చుకుంటున్నాను" అని అనేవాడు. అంతేకాదు. ప్రపంచంలోని ముఖ్యమైన పట్టణాలు, నదులు, సము

ద్రాలు, పర్వతాలు, నౌకాశ్రయాలు అన్నీ ఎక్కడెక్కడున్నాయో కంఠస్థం చేసుకోవాలనుకుంటున్నాను. అన్నిటికన్నా ముఖ్యంగా నా ప్రపంచజ్ఞానాన్ని పెంచుకోవాలని ప్రయత్నం. పత్రికలంటే సామాన్యమైనవికావు. అవి వర్తమానచరిత్రకు ఆధారాలు" అని, తన కృషిని వివరించేవాడు.

ఒక్కొక్కసారి పత్రిక పట్టుకొని, చైనాదేశ పటాన్నీ, ప్రపంచ పటాన్నీ ప్రక్కన పెట్టుకొని గంటలుకొద్దీ గడిపేవాడు. ఆయన జ్ఞాపకశక్తి అసాధారణం. ఈనాడుకూడా ఏదైనా ఒక స్థలం పేరు చెబితే, అది చైనాలో ఏ రాష్ట్రంలో, ఏ జిల్లాలో ఉన్నదికూడా వెంటనే చెప్పగలడు. విదేశాల విషయం కూడా అంతే. షాంగ్‌హై, పెకింగు, చాంగ్షా పత్రికలను యీ విధంగా అతితీక్ష్ణంగా చదవడం, తాను చింగ్ కాంగ్ షాన్‌లో విప్లవ పోరాటానికి నాయకత్వం వహించిన నాటివరకు మావో-సే-టుంగ్ నిరంతరాయంగాసాగించాడు.

చరిత్రను అధ్యయనం చేసేటప్పుడు ఎలా మూలసూత్రాలను తరచి అవగాహన చేసుకునేవాడో, అలాగే భూగోళం విషయంలో కూడా వివరాలను ఎంతో విపులంగా సేకరించేవాడు. ఏ విషయంలో కూడా ఊహావాదమనేది లేదు. ఏవిషయాన్ని తీసుకున్నా, అందులో కూలంకష పరిజ్ఞానం సాధించేవరకు విడిచిపెట్టేవాడు కాదు.

అంతులేని యీ విజ్ఞాన తృష్ణ. చిన్ననాటి నుండి ఆయన ప్రత్యేకత. అధ్యయన పరిశోధనాది విషయాల్లో ఆయన అవలబించిన పద్ధతులు, విధి విరామం లేకుండా సాగించిన కృషి ఫలితంగా ఆయనలో బహు ముఖ పాండిత్యం పెంపొందింది.

చరిత్రలో మహాపురుషులైన మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్లలాగా మావో-సే-టుంగ్ మహోత్తమ విప్లవ నాయకుడు, ప్రచారకుడు, నిర్మాణ దక్షుడు, విప్లవ యోధుడు. అంతేకాదు. అన్నిటికన్నా ముఖ్యంగా ఆయన మహా విజ్ఞాని.

# నిర్మాణదక్షుడు

తన ఉత్తమగుణసంపదతో మావో-సే-టుంగ్ పాఠశాలలోని విద్యార్థులందరి గౌరవాన్ని చూరగొన్నాడు. ఆయన శ్రద్ధాసక్తులు, ప్రవర్తన, భావాలూ, అభిప్రాయాలు, ప్రతివిషయంలోను ఆయన చొరవ, అభివృద్ధి; ఆయన నిరాడంబర స్ఫుర ద్రూపం, ఆత్మవిశ్వాసంతో ప్రతి విషయాన్నీ సునాయాసంగా సాధించగల నేర్పు-ఈ గుణగణాలన్నిటినీ తోడివిద్యార్థులు ఎంతో మెచ్చుకునేవారు. వాటిని అనుకరించేవారు. కొందరు ఆయనను తమ ఆదర్శంగా తీసుకున్నారు. ఆయన అడుగుజాడల ననుసరించారు. అభ్యుదయ కాంక్షతో, శ్రద్ధాళువులై కృషిచేయ నారంభించారు. నలుగురూ కలిసి సరదాగా ఉన్నప్పుడు ఎప్పుడూ నిష్కపటంగా, నిర్మొహమాటంగా ప్రవర్తించేవాడు. శాస్త్రం, సాహిత్యం, సద్గుణాలు, ఆనాటి ప్రపంచపరిస్థితులు మొదలైన అనేకవిషయాలను గురించి వారితో ముచ్చటించేవాడు. కాని, ఎవరి అంతరంగికజీవితంగురించీ, ఏనాడూ పల్లెత్తుమాట అనలేదు. అచంచలదీక్షతో సాగించిన నిర్విరామకృషిఫలితం ఆయన బహుముఖ పాండిత్యం. అయినా ప్రస్ఫుటంగా, ప్రశాంతంగా ఆయన సాగించేసంభాషణల్లో, సమస్య యొక్క కీలకాన్ని ఇట్టె కనిపెట్టేసేవాడు.

ఎదుటివారు మాట్లాడుతున్నప్పుడు తలఒకవైపు కొద్దిగా వంచివినడం ఆయనకు అలవాటు. అలా, వారు మాట్లాడుతున్నంత

సేపూ, 'ఊఁ,' "అవును" అని అనడం తప్ప తరుచు తానేమీ పలికేవాడుకాదు. ఆ తరువాత, ఆ క్షణంలోనే, వారు చెప్పిందంతా సవిమర్శకంగా పరిశీలించి, ముఖ్యాంశాలను ఏరితీసి, క్రోడీకరించే వారు. ఇదంతా అవి, తూచినట్లు బహుకొద్దిమాటల్లోనే పూర్తి చేసేవాడు. ఎప్పుడూ సూటిగా మాట్లాడడం ఆయన స్వభావం. మాట్లాడే ప్రతివిషయమూ ఉత్తేజకరంగా ఉండేది. తరుచు ఎవరో ఒకరు, ఏదో ఒక సమస్యతో ఆయన దగ్గరకు వచ్చే వారు. కొద్దిసేపు ఆయనతో మాట్లాడేసరికే, అదొక సమస్యలాగే కనబడేదికాదు. మంత్రం వేసినట్లు అంతా తేటతెల్లమయిపోయేది. ఎలాంటి విషయాల్లోనైనా సలహాలు, పరిష్కార సూచనలు ఆయన తడుముకోకుండా ఇవ్వగలిగేవాడు. ఆయన భావనాశక్తి అక్షరాలా అపారము. దీక్షాబలం, విజ్ఞానం, సునిశితమైనవాదనా పటుత్వము, తక్షణ నిర్ణయశక్తి, ప్రతి విషయంలోనూ పైకి సాహసంగా కనబడు తున్నా, నిజానికి జాగ్రత్తగా ఆలోచించి వ్యవహరించడం - ఇవి యన గుణగణాల్లో మరికొన్ని. ఆయనలోని విశిష్టతను సరిగా వర్ణించగల ఆమాటలేవి దొరకక, ఆయన విద్యార్థి మిత్రులూ, అంతకు పూర్వం విప్లవోద్యమంలోని సహచరులూ—

"మావో-సే-టుంగ్ అక్షరాల ఒక అసాధారణ వ్యక్తి. అయన శక్తిసామర్థ్యాలుకూడా అద్భుతం" అని అనేవారు.

తనతోడి విద్యార్థులతో, ఆయన ఒకసారి ఇలా అన్నాడని అంటారు:

"ప్రపంచంలో రెండురకాల మనుష్యులున్నారు. ఏదో ఒక విషయంలో వ్యక్తిగతంగా సమర్థులైనవారు కొందరు. ప్రజలను సంఘటితపరచి ఘనకార్యాలు సాధించడంలో నేర్పరులు మరి కొందరు. వీరిలో మొదటితరగతివారే ఎక్కువమంది. ప్రతివారి

లోనూ ఒక ప్రత్యేకత ఉంటుంది; శక్తిసామర్థ్యాలు ఉంటాయి అవి ఎంత స్వల్పమయినాసరే; వాటిని మరింత రాణింపజేసుకొని, సద్వినియోగం చేయగలిగేలా వారిని ప్రోత్సహించాలి. ఒకరిని గురించి మనం ఒక నిర్ణయానికి వచ్చేటప్పుడు వారి ప్రత్యేకతను ముందుగా లెక్కలోకి తీసుకోవాలి."

ఈ విధంగా, ఆయా వ్యక్తుల ప్రత్యేక శక్తిసామర్థ్యాలను గుర్తించి, వారిని ప్రోత్సహించి, వాటిని రాణింపజేయగల శక్తి మావో-సే-టుంగ్‌లో ఎంతైనా ఉంది. సాటిలేని విప్లవోద్యమ నిర్మాత, విప్లవయోధుడే అయిన మావో-సే-టుంగ్, చైనాదేశాన్ని, ప్రజల్ని విముక్తిపరచడంలో దిగ్విజయం సాధించ గలిగాడంటే, అందుకు ఈ శక్తి ఒక ముఖ్యమైన కారణం.

"విప్లవ లక్ష్యాలను సాధించడంలో చివరకు కుంటి, గుడ్డి, చెవిటి, మూగ మొదలైనవారు కూడా ఉపయోగపడగలరు" అని ఆయన తరుచు అనేవాడు.

ఒకసారి పార్టీ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నారు: "ఒక కామ్రేడుకూ నీకూగల సామ్యాన్ని ముందు లెక్కలోకి తీసుకో. విప్లవదీక్ష, మార్క్సిజం-లెనినిజంలో విశ్వాసం మొదలైనవాటిలో పోలికలను ముందు కనిపెట్టు. ఆతరువాతనే అతనిలో సిద్ధాంతరీత్యా లోపాలు మొదలైనవేమైనా ఉన్నా యేమో చూడు".

కార్యకర్తల విషయంలో సక్రమమైన ఈ దృక్పథం, మొండి సిద్ధాంతవాదుల, గుడ్డి ఆచరణవాదుల వైఖరికి పూర్తిగా విరుద్ధం. లోపాలనెప్పుడూ ఎత్తిచూపి, తూర్పార బట్టడమే కార్యదక్షతను పెంపొందించేందుకు ఉత్తమ మార్గమని వారివాదం. కాని అందుకు పూర్తిగా విరుద్ధంగా, ప్రతివారిలోని మంచిని చూపి, ప్రోత్సహించ

డంవల్లనే సత్ఫలితాలు కలుగుతాయని మావో సే-టుంగ్ సిద్ధాం తము. తప్పులు చేసినవారి విషయంలోనూ, పెడమార్గం పట్టినవారి యెడల, లేదా రాజకీయ చైతన్యం ఇంకా తగినంతగా కలుగని వారిపట్ల, వారు పార్టీ సభ్యులే కానివ్వండి, పార్టీ వెలుపలనున్న అభి మానులే కానివ్వండి ఆయన సర్వదా అవలంబించే సూత్రం, లోపరహితులనుచేసి కాపాడడం, 'ప్రతివ్యక్తి తనను తాను సవరించు కునేందుకు తోడ్పడటం.'

# విద్యార్థి సంఘనిర్మాణం

మావో-సే-టుంగ్ శక్తిసామర్థ్యాలు, నిర్మాణదక్షత తొలి సారిగా తనహైస్కూలు విద్యార్థిసంఘ నిర్మాణంలో ప్రతిఫలిం చాయి. ఆయన సంఘసేవా కార్యకలాపాలకు, ప్రజాతంత్ర ఉద్య మానికి అది నాందీ సూచకం. ఈనాడాయన చైనా ప్రజానాయకుడుగా పరిణతిచెందాడంటే అది చైనా ప్రజాపోరాటాల్లో ఆయన నిర్వ హించినపాత్ర పర్యవసానం. అందులో తొలి అనుభవం ఆపాఠ శాలల్లోనే.

ఆరోజుల్లో ఒక్క హూనాన్ రాష్ట్రంలోనే కాకుండా చైనా దేశమంతటా పాఠశాలా నిర్వహణ అవినీతితో నిండి, నియంతృత్వ ధోరణిలో సాగేది. అందుకు ఆనాటి విద్యావిధానమే ప్రబల నిద ర్శనం. ఎవరైనా ప్రధానోపాధ్యాయుడు కాదలచుకుంటే వివిధ ఉద్యోగులను ఆశ్రయించి, లంచాలు మొదలైన వాటిద్వారా వారి అభిమానాన్ని సంపాదించి, వారిని భట్రాజు పొగడ్తలు పొగిడి కాళ్లావేళ్లా పడితేచాలు. దానికితోడు స్వంతబాకా కూడా ఊదు కోవాలి. ఆవిధంగా ప్రధానోపాధ్యాయ పదవి సంపాదించి తరు వాత అతనుచేసే మొట్టమొదటిపని తమ ఆప్తులను బంధువులను

తెచ్చి, పాఠశాల నిర్వాహణాధికారులుగానూ, తదితర ముఖ్యపదవుల్లోనూ నియమించడం. ఈ పదవులకు వారికి ఏపాటి మాత్రం కూడా అర్హత ఉండేది కాదు. అయినప్పటికీ ఇది తగదు అని నోరెత్తడానికి విద్యార్థులు సాహసించేవారు కాదు. పాఠశాలనిధిపై అధికారం ప్రధానోపాధ్యాయునికే ఉండేది. ఆసొమ్మంతా ఎక్కువగా అతని స్వలాభానికే వినియోగమయేది. విద్యార్థుల భోజనాది విషయాల్లో ఎంతో అక్రమానికి ఒడిగట్టి డబ్బుదోచేవారు.

మంచూ రాజుల పాలన అంతరించి యువాన్-షి-కై అధ్యక్షస్థానంలోకి వచ్చినప్పటికే ప్రధానోపాధ్యాయు లందరూ పాతప్రభుత్వ పక్షపాతులే. ప్రతి పాఠశాల సమావేశ మందిరంలోనూ "అధ్యక్షుని ఆదేశం" పెద్దపెద్ద అక్షరాలతో గోడనలంకరించేది. దాని ధోరణి అంతా పాతదే. హక్కులునాస్తి, వినయవిధేయతలు తప్పనిసరి...విద్యార్థిలోకానికి చిరపరిచితమైన ఇలాంటి అంశాలే దాని నిండా. విద్యార్థులంతా సమావేశంకాగానే ఎవరో ఒక ఉపాధ్యాయుడు దానిని బిగ్గరగా చదివి వినిపించేవాడు. దాని నెవరూ వినేవారుకాదు. కిల్లి అరుపులు మొదలైన అలజడి పెచ్చుపెరిగేది.

ప్రధానోపాధ్యాయుల్లో చాలమంది ఏదో ఒక విధంగా అధికారవర్గాలతో సంబాధండున్నవారే. అందువల్ల పాఠశాలకు సంబంధించని ఏ కార్యకలాపాల్లోనూ విద్యార్థులను పాల్గొన నీయకుండా వారు అణచివేయడం సహజమే. పాఠ్యగ్రంధాలుతప్ప మరేమీ చదవనిచ్చేవారు కాదు. పాఠశాలలోగాని, బయటగాని ఏలాంటి కార్యక్రమాల్లోనూ పాల్గొననిచ్చేవారు కాదు. ఇదీ ఆనాటి పాఠశాలల పరిస్థితి. మావో-సే-టుంగ్ చదువుతూన్న హైస్కూలుస్థితి అందు కేమీ భిన్నంకాదు.

ఈ స్థితిని సహించలేక ఆ పాఠశాల విద్యార్థులెన్నోసార్లు సమ్మెచేశారు. ప్రధానోపాధ్యాయుడిని మార్చమని రాష్ట్రప్రభు

త్వాని కెన్నోసార్లు విజ్ఞాపనలు పంపారు. విద్యార్థిహక్కుల రక్షణకు మావో-సే-టుంగ్ నడుంబిగించాడు. పాఠశాలాధికారుల నిరంకుశత్వాన్ని, అవినీతిని తీవ్రంగా ఎదుర్కొన్నాడు. శక్తిసామర్థ్యాలనే కాకుండా, అచంచల దీక్షాబలాన్నికూడా ఆయన ప్రదర్శించాడు. అధికారులకు లొంగిపోకుండా తమ హక్కులకోసం దీక్షతోపోరాడే వానిగా విద్యార్థులు ఆయనను గుర్తించారు. తమ నాయకునిగా ఎన్నుకున్నారు. అందుకోసం, పాఠశాలలోనుంచి ఆయనను వెళ్ళగొట్టేందుకు అధికారు లొకసారి ప్రయత్నించారు. కాని ఆయన వెనుక పాఠశాల విద్యార్థులంతా ఏకముఖంగా నిలిచారు. పాఠశాలలోని ప్రజాతంత్ర వాదులైన కొద్దిమంది ఉపాధ్యాయులుకూడా ఆయనపక్షం అవలంబించారు. దానితో అధికారులు తమ ప్రయత్నం మానుకొనక తప్పిందికాదు. ప్రజాతంత్రవాదులైన ఆ ఉపాధ్యాయులను అధికారులు కంటిలో నలుసులాగా చూచేవారు.

తోటివిద్యార్థుల సంపూర్ణ సహకారంతో మావో-సే-టుంగ్ అందరికన్నా చురుకైనవారిని సమీకరించాడు. గుడ్డిలో మెల్లలాగా కొంత విశాలభావం, ప్రజాతంత్రదృష్టి కలిగి, యువాన్-షి-కై వ్యతిరేకి అయిన ఒకతను, ఆరోజుల్లో ప్రధానోపాధ్యాయుడుగా ఉండేవాడు. దీనిని అవకాశంగా తీసుకొని మావో-సే-టుంగ్, ఆయన సహచరులు విద్యార్థిసంఘాన్ని స్థాపించారు. హూనాన్ పాఠశాలల్లో అంతవరకు కనివిని ఎరుగని సంఘటనఅది. ఆ పాఠశాల విద్యార్థులపై దాని ప్రభావం ఇంతంతకాదు. పాఠశాల నిర్వహణను గురించిగాని, విద్యావిషయమైగాని ఏదైనా సమావేశం జరుగుతే, ఆ సంఘ ప్రతినిధినికూడా ఆహ్వానించక తప్పేదికాదు. పాఠశాల నిర్వహణనుగురించి జరిగే నిబంధనలు విద్యార్థిసంఘ ఆమోదాన్నికూడా పొందవలసి వచ్చేది. ఆ సంఘంద్వారానే విద్యార్థులంతా తమకోర్కెలను అధి

కారులకు నివేదించేవారు. పాఠశాల కార్యకలాపాలు, విద్యార్థుల దైనందిన జీవితం, క్రమశిక్షణ, విద్యార్థులకు అభిరుచిగల ఇతరకార్యక్రమాలు మొదలైన విషయాలను సంబంధించిన సమస్యలన్నీ, ఆ సంఘం ఏర్పడినతరువాత, సంతృప్తికరంగా పరిష్కారమయేవి. ఆ పాఠశాలలోని ఇంచుమించు అయిదువందలమంది విద్యార్థులూ మావో-సే-టుంగ్ నాయకత్వాన్ని అంగీకరించారు. ఆయన పిలుపివ్వగానే ఏలాంటిచర్యకయినా సిద్ధంగా ఉండేవారు.

కొన్నాళ్ళవరకు ఆ పాఠశాల జీవితం ఎంతో కోలాహలంగా ఉత్సాహకరంగా సాగింది. విద్యార్థుల రచనల, చిత్రరచనల ప్రదర్శనలు, ఆటలపోటీలు, చర్చలు, ఆయావిషయాల్లో ప్రత్యేక పరిశోధనలు సాగించే విద్యార్థుల గోష్ఠి - అన్నీ ఒకదాని వెంట ఒకటి తెరపి లేకుండా సాగాయి. ప్రతి ప్రదర్శనంలోను మావో-సే-టుంగ్ సాహిత్య కృషి, లిపి రచన ప్రత్యేక ప్రశంసల నందేవి. ప్రేక్షకుల అభిప్రాయాలను తెలిపే పుస్తకంలో అందరూ ఆయనను ప్రత్యేకంగా పేర్కొనేవారు. జపాను దురాక్రమణ ప్రతిఘటన పోరాటం ప్రారంభమయిన నాటివరకు ఆ విద్యార్థి సంఘం, దాని శాఖలతో సహా నిలచింది. ఈ వివిధ విద్యార్థి సంస్థలు, సాంఘిక, రాజకీయ ఉద్యమాలలో ప్రముఖపాత్రను నిర్వహించాయి.

## సైనిక రాజ్యాధికారులకు వ్యతిరేకంగా ఉద్యమం

టాన్-యెన్‌కాయ్ స్థానంలో హూనాన్ రాష్ట్ర మిలిటరీ గవర్నరు పదవికి టాంగ్-సియాంగ్-మింగ్ కొత్తగా నియమింపబడ్డాడు. అతనిని ఆ పదవికి నియమించింది యువాన్-షి-కాయ్. 1911 విప్లవం ఫలితంగా చైనాలో ఏర్పడిన రిపబ్లికన్ రాజ్యాంగాన్ని రద్దుచేసి, తనను తానే చక్రవర్తిగా ప్రకటించుకోడానికి యువాన్-

షి-కాయ్ నిశ్చయించుకున్న రోజులవి. హూనాన్ కొత్త గవర్నరు టాంగ్-సియాంగ్-మంగ్ పేరుకి టుంగ్ - మెంగ్ - హుయ్ సంస్థ సభ్యుడే. కాని, నిజానికి అతను మంచూ రాజుల గూఢచారి. హూనాన్ రాష్ట్రంలో అణుచుపెట్టి పెట్టడంతో అతను భయంకర హత్యాకాండ ప్రారంభించాడు. 'నరహంతకుడు టాంగ్' అనే బిరుదు సంపాదించుకున్నాడు. యువాన్-షి-కాయ్, తన కుట్రను కొనసాగించి, చక్రవర్తిగా ప్రకటించుకున్న వెంటనే, యీ రక్త పిపాసికి 'ప్రభు' (మార్క్విస్) బిరుదు ఇచ్చాడు.

కాని యువాన్ చక్రవర్తిత్వం మూన్నాళ్ళ ముచ్చటే అయింది. తొలిసారిగా యున్నాన్ రాష్ట్రం అతనిపై ధ్వజమెత్తింది. ఆ వెంటనే ఒక రాష్ట్రం తరువాత మరొకటి స్వాతంత్ర్యం ప్రకటించు కున్నాయి. 'రిపబ్లిక్ సంరక్షణ సైన్యం' ఒకటి ఏర్పడి జెచువాన్, హూనాన్, క్వీచౌ రాష్ట్రాలపైకి నడిచింది. యాంగ్సీ నదీలోయలో కూడా, ఈ తిరుగుబాటును నడిపేందుకు డాక్టర్ సన్ యట్-సేన్ తన సహచరులను పంపారు. హూనాన్ రాష్ట్రంలో "టాంగ్‌ని తన్ని తరుమండి" అనే ఉద్యమం 1916 లో ప్రారంభమైంది. ఇప్పుడు జన చైనా కేంద్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అయిన లిన్-పో-చు (అప్పుడు అతనిపేరు లిన్ సు-హాన్) మొదలైనవారు దానికి నాయ కత్వం వహించారు. ఇన్ని రాష్ట్రాలు ఎదురుతిరిగేసరికి యువాన్-షి-కాయ్ తోకముడిచాడు. చక్రవర్తిత్వాన్ని పరిత్యజించి, తిరిగి అధ్యక్ష పదవికి దిగివచ్చాడు. ఈ విధంగా అతని రాజరికం నూరు రోజులు తిరక్కముందే నేల కూలింది.

'రిపబ్లిక్ రక్షణ సైన్యం' సర్వాంగ సమన్వితమయి స్థిర పడింది. త్వరత్వరగా మరికొన్ని రాష్ట్రాలు కూడా స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాయి. దురాశతో తాను నిర్మించుకున్న ఊహా

సౌధాలన్నీ నేలకూలేసరికి, యువాన్-షి-కై మనోవ్యాధితో మరణించాడు. అంతలోకే హూనాన్ రాష్ట్రంనుండి నరహంతకుడు టాంగు కూడా ఉద్వాసన జరిగింది.

1917 జులై 1వ తేదీని, అధికారంలోంచి తొలగించబడిన పు-యికి తిరిగి అధికారం కట్టబెట్టేందుకు చాంగ్-సున్ * ప్రయత్నించాడు. జులై పదికల్లా ఆ ప్రయత్నం పూర్తిగా విఫలమయింది. ఫెంగ్-కో-చాంగ్ రిపబ్లిక్కు అధ్యక్షుడయ్యాడు. టువాన్-చి-జాయి ♦ ప్రధానిగా నియమింపబడ్డాడు. హునాన్ రాష్ట్రానికి ఫు-లియాంగ్-సావో కొత్తగా మిలిటరీ గవర్నరయాడు. అతను ఉత్తరాది సైనిక రాజ్యాధికారుల ముఠాకు చెందినవాడు. నరహంతకుడు 'టాంగ్'కి పూర్వం గవర్నరుగా ఉండిన టాన్-యెన్-కాయ్ ఆ పదవి నాశించాడు. ఉత్తరాది ముఠాతో పోటీదారులైన నైరుతీ చైనా ముఠాకు, సాయం రమ్మని కబురు పంపాడు. హూనాన్ రాష్ట్రంలో తనస్వంత సైనిక సన్నాహాలుకూడా ప్రారంభించాడు. చైనా దేశమంతా నానా అల్లకల్లోలంగా ఉన్న రోజులవి. ఎటు చూచినా అధికారంకోసం పెనుగులాటే. ఆ పరిస్థితుల్లో చాంగ్షా పాఠశాలలను ఆయా ముఠాల సేనలు బలవంతంగా ఆక్రమించుకొనేవి. అవి తరచు చేతులు మారుచుండేవి.

రిపబ్లిక్కు సంరక్షణ "సైన్యం" దెబ్బను తట్టుకోలేక ఫు-లియాంగ్-సావో ఉత్తరాది సేన చెల్లా చెదురుగా, చాంగ్షా వైపు పారిపోతున్న సమయమది. చాంగ్షాలోని పాఠశాల భవనాలన్నీ ఆ సైనికులు ఆక్రమించుకోవాలనుకున్నారు. మావో-సే-టుంగ్ చదువుతున్న పాఠశాల భవనాలు నగరం దక్షిణ ద్వారం

* చాంగ్-సున్ ; చూ 46 వ పేజీ

♦ టువాన్-చి-జాయి : (1864-1936) యువాన్-షి-కాయ్ కుడిభుజం.

వెలుపల ఉండేవి. అవి అందమైన ఆధునిక భవనాలు. ఇక ఆ సైని కుల కన్ను వాటిమీద పడిందని వేరే చెప్పనవసరంలేదు. పాఠశాల అధికారులకుగాని, ప్రజలకుగాని ఆ పరిస్థితుల్లో ఏమి చేయాలో తోచలేదు. అప్పుడు మావో-సే టుంగ్ పాఠశాల రక్షణ బాధ్య తను తీసుకున్నాడు. విద్యార్థుల్లోని వ్యాయామ నిపుణుల నందరినీ సమీకరించాడు. ప్రాకార ద్వారాలన్నిటి దగ్గర బెంచీలు, కుర్చీలు మొదలయినవి ప్రోగుపోసి బారికేడ్లు నిర్మించారు. అంతకుముందే ఉత్తరాది సైనికులవద్దనుండి లాక్కున్న కొద్దిపాటి తుపాకులు పట్టు కొని రక్షణ ప్రదేశాలు చూచుకొని సిద్ధంగా నిల్చున్నారు. పిరికి గుండెకల విద్యార్థులు, ఉపాధ్యాయులు, విద్యార్థి వసతి గృహాల వెనుక పడవడ వణుకుతూ వొదిగి కూర్చున్నారు. తుపాకి శబ్దం వినేసరికి, వారా భయంతో బిగుసుకుపోయారు. కాని, బాధ్యతగల అధికారులందరూ, కొంతమంది ఉపాధ్యాయులతో సహా, మావో-సే-టుంగ్ ఏపని చెపితే, ఆపని మారు మాటాడకుండా చేశారు. మామూలుగా వారిలోఉండే డాబు దర్పాలు పటాపంచలయి పోయాయి. ఈ ప్రతిఘటన ఫలితంగా ఉత్తరాది సైనికులు పాఠ శాల జోలికిరాకుండా, రెండు మూడు తూటాలు ప్రేల్చి, ఆప్రక్క నుంచే రైలుకట్ట వెంబడి, అరుచుకుంటూ, దక్షిణానికి సాగి పోయారు.

వెంటనే మావో-సే-టుంగూ, తదితర విద్యార్థులు, పాఠ శాల వెనుకనున్న గుట్టపైకి వెళ్ళి ఆ సైనికుల్ని బాగా మందలించి వచ్చారు. ఆ విధంగా అందమైన ఆ పాఠశాల భవనాలు చెక్కు చెదరకుండా, అరాచక సైనిక మూకల ఆక్రమణకు, లూటీ గురికాకుండా నిలిచాయి. అప్పుడప్పుడు, ఈ ఉదంతాన్ని గురించి

సరదాగా మాట్లాడుతూ, "మిలిటరీ కార్యకలాపాల్లో అది నా తొలి అనుభవం" అని మావో సే-టుంగ్ అంటూంటారు.

రిపబ్లిక్ ఏర్పడిన మొదటి సంవత్సరాల్లో చైనాదేశం నానా సంక్షోభంగా ఉండేది. ద్వితీయవిప్లవం, రిపబ్లిక్ సాయుధ సైన్యం జైత్రయాత్ర, యున్నాన్ - క్వీచౌ క్వాంగ్‌టుంగ్ - క్వాంగ్సి మొదలైన రాష్ట్రాలు రెండవసారి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవడం, పాత సార్వభౌమాధికారాన్ని మళ్ళీ స్థాపించడానికి జరిగిన ప్రయత్నం, ఉత్తరాది మిలిటరీ పెత్తందార్లలో పెకింగ్ ముఠాకు, అన్‌హ్వై (టువాన్) ముఠాకు మధ్య అధికారంకోసం పెనుగులాట వీటన్నిటి ఫలితంగా అదివరకే గందరగోళంగా ఉన్న హూనాన్ పరిస్థితి మరింత అయోమయ మయింది.

ఉత్తరాది సైనిక రాజ్యాధికార్ల ముఠాల్లో పోటీపడుతున్న వైరుతి చైనాముఠాను కూడా నుంచిచేసుకునేందుకు, అప్పటి రిపబ్లిక్ అధ్యక్షుడు ఫెంగ్ కావో, చాంగ్‌టాన్-యెన్-కాయ్‌ని హూనాన్ రాష్ట్ర మిలిటరీ గవర్నరుగా ప్రకటించాడు. దీనిని అన్‌హ్వైముఠా అంగీకరించలేదు. యుద్ధం కొనసాగవలసిందే అన్నారు. దాంతో ఫెంగ్ మాడిపడి, హూనాన్-క్వాంగ్సి ప్రాంతాన్నంతా ఆక్రమించుకోవలసిందిగా చాంగ్ చింగ్-యావో అనే సేనాధిపతిని, మరి ఇద్దరిని నియోగించాడు. అప్పటి చైనా ప్రధాని టువాన్-చి-జుయి, చాంగ్ చింగ్ యావోని హూనాన్ - రాష్ట్రానికి మిలిటరీ గవర్నరుగా నియమించాడు.

చాంగ్ సేన అప్పుడే చాంగ్షా నగరం వెలుపలనే గుడారాలు వేసికొనిఉంది. ఆ సైనికులకు క్రమశిక్షణ అనేది ఏమీలేదు. వారి ప్రవర్తన ప్రజల్లో ఆగ్రహావేశాలను రగుల్కొలిపింది. ఆ రోజుల్లోదు హూనాన్ రాష్ట్రంలో అభ్యుదయభావాలు కలవారి నందరిని

అణచివేయడమే పనిగా పెట్టుకొన్నాడు చాంగ్. తన సాంఘిక, రాజకీయ కార్యకలాపాలకు చాంగ్ తీరని ప్రతిబంధకం అనుకొని మావో-సే-టుంగ్, "చాంగ్‌ని పారద్రోలాలి, అనే నినాదంతో, పెద్దఎత్తున ఉద్యమం ప్రారంభించాడు. (అదే నినాదంతో, అంత కన్నా చిన్నస్థాయిలో అదివరకే ఒకసారి ఒక ఉద్యమం సాగింది. అయితే అది, మావో చదివిన హైస్కూలు యొక్క అవినీతిపరుడైన ప్రధానోపాధ్యాయుడు చాంగ్-కాన్‌కు వ్యతిరేకంగా సాగింది. దానికీ, దీనికీ కూడా నాయకత్వం మావోదే.) సైనికరాజ్యాధికారులకు వ్యతిరేకంగా ఆ ఉద్యమం ఆ విధంగా హూనాన్ రాష్ట్రంలో అంకురించి, శాఖోప శాఖలై దేశమంతటా విస్తరించింది.

# సిన్‌మిన్ సొసైటీ - హూనాన్ రాష్ట్ర విప్లవోద్యమ ప్రచారకసమితి

1917 వేసవిలో, చాంగ్షాలోని ప్రతిపాఠశాలలోనూ గోడల మీద చిన్నచిన్న పోస్టర్లు ప్రత్యక్షమయాయి. వాటిలో ఉన్నది చక్కని దస్తూరీలో కొద్ది పంక్తులు మాత్రమే. "బుల్‌బుల్ పాడుతూంది-మిత్రులను అన్వేషిస్తూంది;" అన్న చైనా ప్రాచీన కావ్య ప్రయోగముతో, అందులోని విజ్ఞాపన ప్రారంభమయింది. దేశ క్షేమాన్ని, ప్రజల శ్రేయోభివృద్ధులను కాంక్షించే వారంతా ముందుకొచ్చి, ఆ ప్రకటనకర్తతో భుజంభుజం కలుపవలసిందని అందులోని విజ్ఞప్తి. అది యువకులకోసం బహిరంగ లేఖలాంటిది. దాని మీద ఎవరిసంతకమూ లేదు. '28 గీతలు' ఉన్నమాట మాత్రమే ఉంది. (మావో-సే-టుంగ్ అన్న శబ్దాన్నిచ్చే మూడు చైనా అక్షరాల్లోనూ మొత్తం 28 గీతలుంటాయి,)

కొమింటాంగు నరహంతకుల ఎదుట, మృత్యుముఖంలో నిలిచికూడా, ఆ వీరుడు అక్కడచేరిన ప్రజల నుద్దేశించి, కొమింటాంగు ద్రోహులను చీల్చిచెండాడుతూ ఉత్తేజకరంగా ప్రసంగించాడు. స్వేచ్ఛా, స్వాతంత్ర్య, ప్రజాస్వామ్యాలకై అచంచల దీక్షతో పోరాటం కొనసాగించవలసిందిగా ప్రజలను తన తుదిసందేశం అందజేసి ప్రాణాలర్పించాడు.

హో-జుయె-సాన్, సియాంగ్‌టాన్ ప్రాంతంవాడు. చాంగ్షా కార్మికోద్యమంలో ప్రముఖపాత్రనిర్వహించాడు. విప్లవం ఓడిపోయిన తరువాత ప్రాణా లర్పించాడు.

సాయ్-హో-షెన్ కూడా వీరమరణం పొందాడు (చూ. పేజీ 61).

యియాంగ్ ప్రాంతవాసి సియాసి. 1934 నాటి రెడ్ఆర్మీ మహాప్రస్థానంలో, ప్రమాదవశాన నదిలోపడి చనిపోయాడు.

హోషు-హెంగ్ ది నింగ్-సియాంగ్ ప్రాంతం. సిన్‌మిన్ సొసైటీ కమ్యూనిస్టుపార్టీల తొలి సభ్యులందరిలోకీ పెద్దవాడు. కియాంగ్సీ రాష్ట్రాన్ని విడిచిపెట్టి రెడ్ఆర్మీ తన దీర్ఘయాత్ర ప్రారంభించిన తరువాత, తనను పట్టుకోడానికి వచ్చిన విప్లవ వ్యతిరేకులను ధైర్యంగా ప్రతిఘటించి, వీరమరణం పొందాడు.

...ఇలాగే ఇంకా ఎందరెందరో వీరులు, చైనా ప్రజల విముక్తికై పోరాడి అమరత్వం పొందారు. ఈ చైనా వీరపుత్రికా, పుత్రుల ధర్మనిరతి, సాహసచర్యలు చరిత్రలో ఎన్నటికీ మాసిపోవు.

♦ ♦ ♦

మే నాలుగు ఉద్యమ దశలోనూ, విప్లవ సందర్భంలోనూ కొనసాగిన విద్యార్థి యువజనోద్యమాలలో మావో-సే-టుంగ్ పాఠశాల చాల ప్రధానపాత్ర నిర్వహించింది. అందుకు కారణం,

విద్యార్థి ఉద్యమానికి మూలసంస్థ అయిన సిన్-మిన్ సొసైటీయే. నవసంస్కృతి ఉద్యమానికి, మేధావులలో బయలుదేరిన ఇతర ఉద్యమాలకు ఆ సంస్థ సభ్యులు పట్టుగొమ్మలుగా ఉండేవారు. అంతే కాదు. కార్మిక, కర్షక, కార్యకలాపాల్లో కూడా అ సంస్థే సర్వ శక్తులతో పాల్గొనేది. ఆ విధంగా అది సాంఘిక, రాజకీయ ఉద్యమాల నిర్మాతగా రూపొందింది. అందువల్ల హూనాన్ రాష్ట్రంలోనూ, ఇతర ప్రాంతాల్లోనూ కమ్యూనిస్టుపార్టీకి తొలి అంకురం ఈ సిన్-మిన్ సొసైటీయేనని చెప్పవచ్చు. రహస్య పార్టీ శాఖల పాత్రను ఆ సంస్థ నిర్వహించేది. అదంతా, ప్రధానంగా మావో-సే-టుంగ్ కృషిఫలితం. ఆయన అభ్యుదయ భావాలూ, ప్రతి విషయంలోనూ సరియైన నిర్ణయాలకు రాగల శక్తి, సాహసోపేతమైన కార్యాచరణ విధానం - ఇవన్నీ ఒక ప్రత్యేక విప్లవ పంథాను, విప్లవ సంప్రదాయాలకు కారణభూతమయాయి.

ఆ ప్రకటనను చాంగ్షా పత్రికలు కూడా ప్రచురించాయి. ఫలితంగా ఉత్సాహ భరితులైన విద్యార్థులనేకులు ఆ పిలుపునందుకున్నారు. వారిలో ఎక్కువమంది మావో-సే టుంగ్ పాఠశాల విద్యార్థులే. తక్కిన వాటినుండివచ్చినవారు బహు కొద్దిమంది.

అది హేమంతం. వేసవిసెలవులు పూర్తిఅయ్యాయి. విద్యార్థులంతా తమతమ పాఠశాలలను తిరిగివచ్చారు. హాయిగాలివీచే ఒక నాడు, పండుటాకులు గలగల రాలుతున్న సమయం. యుయేలు పర్వతపాదంవద్ద సాయ్-హో-షెన్ ఇంటిలో,పదమూడు ముప్ఫైమంది సమకూడారు. భోజనంచేస్తూ ఒక సంస్థను ఏర్పరచవలసిన ఆవశ్యకతను, దానిపేరు, నియమావళి, మొదలైన విషయాలను గురించి చర్చించారు.

మావో-సే-టుంగ్ ఈ విధంగా సాగించిన కృషి ఫలితంగా సిన్-మిన్ సొసైటీ (నవమానవ సమితి) ఏర్పడింది. దీని నిర్మాణం విషయంలో మావో-సే-టుంగ్ చక్కని సూచన లెన్నో చేశాడు. ఆ సూచనల ననుసరించి, ఆనాడే సంస్థను స్థాపించారు. స్థాపకునిగా అర్హనైజరుగా మావో-సే టుంగ్‌ని ఎన్నుకున్నారు. ప్రధాన కార్యదర్శి పదవినికూడా ఆయనకే ఇవ్వబోయారు. కాని ఆయన నమ్రతతో అందుకు నిరాకరించి, తాను సహాయకార్యదర్శిగా ఉంటానన్నాడు. ఉత్తమవ్యక్తిత్వాన్ని పెంపొందజేయడమూ, పరిశోధనలుచేసి పండితులు కావడమూ ఆ సొసైటీ లక్ష్యాలు. సభ్యులు జూదమాడరాదు, భోగంవాళ్ళను పోరాదు, సోమరులుగా తిరగరాదన్న నిషేధాలు, దాని నిబంధనావళిలోని కొన్ని అంశాలు. చాంగ్షానగరంలోని అభ్యుదయకాముకులైన యువకులనందర్నీ తొలిసారిగా ఒకే సంస్థలో ఐక్యంచేయడం, ఈ సొసైటీ ప్రత్యేక ప్రాముఖ్యత.

తదనంతరం హూనాన్ రాష్ట్రంలోను, అఖిలచైనాలోనూ జరిగిన సంఘటనలపై ఈ సొసైటీ ప్రభావానికి విలువకట్టడం అసాధ్యం. ఆరోజుల్లో దాని సభ్యులు డెబ్భైమందో, ఎనభైమందో. ఇంచుమించు వాళ్ళందరూ ఆ తరువాత చైనా కమ్యూనిస్టు ఉద్యమంలో అఖండఖ్యాతి గడించినవారే; చైనా విప్లవోద్యమ చరిత్రలో అనేక స్వర్ణపుటలను విరచించినవారే! వారిలో, 1924-1927 విప్లవం ఓడిపోయిన తరువాత ఆత్మార్పణచేసిన అమరవీరుల్లో ఈ దిగువ పేర్కొన్నవారు కొందరు :

క్వో-లియాంగ్, సియాంగ్సిన్ ప్రాంతంవాడు. హూనాన్ రాష్ట్ర కార్మికనాయకుడు. పొట్టిగా ఉండేవాడు. ఎంతో సమర్థుడు. విప్లవం అణగారిన తరువాత, చాంగ్షానగరంలో వీరోచితంగా ప్రాణాలర్పించాడు.

హూనాన్ రాష్ట్రంలోని సుపు ప్రాంత వాసిని, సియాంగ్ చింగ్-యు. చైనా కమ్యూనిస్టుపార్టీలో ప్రప్రథమ మహిళా నాయకురాలు; నేటికీ తనకు సాటిలేనివిపించుకుంటుంది. వక్తగాను, రచయిత్రిగాను, కార్యాచరణలోను అసమానమైన నైపుణ్యాన్ని ప్రదర్శించింది. విప్లవం దెబ్బతిన్న తరువాత, 1928 మే ఒకటవ తేదీని, తెల్లవారుజాము నాలుగుగంటలకు వుహాన్‌నగరంలో కొమింటాంగు రాక్షసులు ఆమెను పట్టుకొని, దారుణంగా చంపారు. ఈ దుస్సంఘటనకు అఖిల చైనా కంపించింది.

చెన్ చాంగ్‌ది వాగ్వాదంలో అందెవేసిన చేయి. శ్రోతల నుర్రూతలూగించగల వాగ్ధాటికి, విప్లవ ప్రచార నైపుణికి అతని కతనే సాటి. పొట్టీకాకుండా, పొడవుకాకుండా మధ్యస్థంగా ఉండేవాడు. చాల అందగాడు. ఆకర్షవంతమైన ప్రవర్తన. విప్లవం దెబ్బతిన్న తరువాత అతను అరెస్టయాడు. తనను చంపవచ్చిన

# అయిదో అధ్యాయం

## నవ సంస్కృతీ ఉద్యమానికి, నూతన ప్రజాతంత్ర ఉద్యమానికి నాయకత్వం

# హనానులో నవసంస్కృతీ ఉద్యమానికి ప్రారంభోత్సవం

"వేలాది సంవత్సరాలుగ చైనా జమీందారీ పీడన క్రింద మూలుగుతుండేది. చైనా ప్రజలు ముఖ్యంగా, రైతులు, ఈ పీడనను వ్యతిరేకంగా గత చరిత్రలో ప్రతిఘటనోద్యమాలు, విప్లవాలు అనేకం సాగించారు. కాని, చివరకు ప్రతిసారీ, దురాశా పరులైన భూస్వాములు, ప్రభువులు తమ స్వప్రయోజనాలను వాటిని సాధనాలుగ ఉపయోగించుకునేవారు. వాటి ఫలితంగా అధికారంలో ఉన్న రాజవంశాలు మారుతూవుండేవి. కాని, చైనా సమాజం యొక్క జమీందారీ స్వభావంలో ఇన్ని శతాబ్దాలుగ ముఖ్యమైన మార్పులేమీ జరగలేదు. ఇక రాజవంశం పోయి, మరొక రాజవంశం వచ్చేది. అంతే. ప్రజల వెన్నువిరిచే జమీందారీ పీడన ఎప్పటిలాగే ఉండేది.

పరాయి సామ్రాజ్యవాద దేశాలు మొదట వర్తకమూ మత ప్రచారము మొదలైన పద్ధతులద్వారానూ, ఆతరువాత దురాక్రమణ యుద్ధాలద్వారానూ సాగించిన కార్యకలాపాలు శతాబ్దాలుగా పాతుకుపోయిన ఈ వ్యవస్థలో చీలికలుపొడవసాగాయి. పరాయిదేశాల దురాక్రమణ, పీడన, నిలువుదోపిడీ, నీచావమానాలతో చైనాదేశమూ, ప్రజలు సతమతమయిపోయారు. అవినీతిలో

కుళ్ళిపోయిన మంచూ ప్రభుత్వం, అటు పరాయి దురాక్రమణ దారుల అడుగులకు మడుగులొత్తుతూ ఇటు ప్రజలపై మరింత పైశాచికత్వానికి పూనుకోవడంతో, ప్రజలద్వేషం అగ్నిపర్వతంలా రగిలింది. అలా రగిలిరగిలి చివరకు 1911 విప్లవరూపంలో ఆ అగ్ని పర్వతంపగిలింది. అది పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య(బూర్జువా-డెమూక్రటిక్) విప్లవం "సంస్కరణ", "నవీనత్వం", "చట్టబద్ధమయిన రాచరికం," మొదలైన నినాదాలతో అంతవరకు సాగిన అర్ధజమీందారీ ఉద్యమాలన్నిటి స్థానాన్ని ఇది ఆక్రమించుకుంది.

కాంగ్ యి-వీ, లియాంగ్ చి-చావో మొదలైన సంస్కరణ వాదుల రచనలు, 'ప్రజలను ప్రేమించేకళ' (జుసుయె) అనే గ్రంధాన్ని రచించిన టాన్ సు-టుంగ్‌లాంటి సంస్కరణవాద ప్రముఖుల రచనలు మావో-సే-టుంగ్‌ని ఆకర్షించాయి. ఆయన మాటల్లోనే చెప్పాలంటే ఆరోజు ఆయనభావాలు "మితవాదం, ప్రజాతంత్ర సంస్కరణవాదం, ఊహాజనిత సామ్యవాదాల కలగాపులగం." కాని 1911 విప్లవంతో ఆయన భావాలు పూర్తిగ మారిపోయాయి. విప్లవప్రజాస్వామ్యంలో ఆయనకు నమ్మకం కుదిరింది. అది ఈనాటికీ సడలలేదు. "మే నాలుగు" ఉద్యమం ప్రారంభమయిన నాటికి, ఈ విప్లవ ప్రజాస్వామ్యంలో మార్పువచ్చింది. "1914 ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధం, 1917 లో రష్యాలో అక్టోబరు విప్లవం ఫలితంగా ప్రపంచంలో ఆరవభాగం ప్రథమసోషలిస్టు రాజ్యంగా రూపొందడం - ఈ రెండుచరిత్రాత్మక ఘటనల ఫలితమే ఆమార్పు" వాటిఫలితంగా విప్లవ ప్రజాస్వామ్యం చైనాలో ఒక పెద్ద ముందంజ వేసింది. దాని సిద్ధాంత బలంకూడా మరింత పెరిగింది. యెనాకే నుంచి ప్రచురితమైన 'చియె ఫాంగ్' (విముక్తి)అనే పత్రికలో, 'మే నాలుగు ఉద్యమం' గురించిన ఒక వ్యాసంలో మావో-సే టుంగ్ ఈమార్పును ఇంకా

స్పష్టంచేస్తూ ఇలా అన్నాడు. "ఆనాటికి చైనాలోని సామ్రాజ్య వాద వ్యతిరేక, జమీందారీ వ్యతిరేక బూర్జువా ప్రజాతంత్ర విప్లవం ఒక కొత్తదశకు పరిణతి చెందింది." తరువాతమావో, ఆదశను "నూతన ప్రజాతంత్రదశ" అని, సరైన శాస్త్రీయమైన నామకరణం చేశాడు.

ఆ వ్యాసంలో మావో సే-టుంగ్ ఇలా అన్నాడు:

"ఇరవై ఏళ్ళకిందట సాగిన 'మేనాలుగు' ఉద్యమం, చైనా యొక్క సామ్రాజ్యవాద వ్యతిరేక, జమీందారీ వ్యతిరేక, పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య విప్లవం ఒక కొత్తదశకు పరిణతి చెందడాన్ని ప్రస్ఫుటంచేసింది. మేనాలుగు ఉద్యమం, సాంస్కృతిక సంస్కరణల ఉద్యమంగా కొనసాగడం, సామ్రాజ్యవ్యతిరేక జమీందారీ వ్యతిరేక పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య విప్లవానికి ఒక ప్రతిబింబం. ఆనాటికి చైనాలో నూతనసాంఘిక శక్తులు పెంపొంద సాగాయి. తత్ఫలితంగా, అదివరకే బాగాబలపడిన ఒక పక్షం - చైనాకార్మిక వర్గం, విద్యార్థిలోకం కొత్తగా తలెత్తిన జాతీయపెట్టుబడిదారీ వర్గంతో కూడిన పక్షం, సామ్రాజ్యవ్యతిరేక, జమీందారీ వ్యతిరేక పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవరంగంలో వెలిసింది. మే నాలుగు ఉద్యమానికి ధైర్యసాహసాలతో అగ్రగాములుగా నిలిచింది విద్యార్థులే. 1911 విప్లవంకన్నా 'మే నాలుగు' ఉద్యమం ఒక అడుగు ముందుకు పోయిందనేందుకు ఇది ఒక నిదర్శనం."

మావో, ఇంకా ఇలా రాశాడు:

"చైనా ప్రజాతంత్ర విప్లవోద్యమంలో, తొలిసారిగా మేల్కొన్నది మేధావివర్గమే. 1911 విప్లవమూ, 'మే నాలుగు' ఉద్యమమూ ఈ విషయాన్ని సుస్పష్టం చేశాయి."

విద్యార్థిలోకంలోనూ, మేధావివర్గమంతటాకూడా రాజకీయ చైతన్యాన్ని పెంపొందజేయడంలో "నవయుగక" అనే పత్రిక

నిర్వహించిన పాత్ర అద్భుతం. అది హూనాన్ చేగిచేడంలో నే దాని ప్రాముఖ్యతను మావో-సే-టుంగ్ గుర్తించాడు. దానిని తన తోటి విద్యార్థులందరికీ పరిచయం చేశాడు. దాని ప్రాశస్త్యాన్ని గురించి ఇలా వివరించాడు: 'నవయువక' లక్ష్యాలు రెండు. వ్యా-వెన్ (ప్రాచీన గ్రాంధిక భాష)ను ప్రతిఘటించి, పెయ్-హువా (ప్రజల వాడుక భాష)ను ప్రోత్సహించడం ఒక లక్ష్యం. రెండవది - పాత నైతిక సూత్రాలను బోధించడాన్ని ఎదుర్కొనడం. "నవయువక శాస్త్రీయ విజ్ఞానాన్ని, ప్రజాతంత్ర భావాలను ప్రచారం చేస్తుంది. కాబట్టి ఆ పత్రిక సాంస్కృతిక పత్రికే కాకుండా, రాజకీయ పత్రిక కూడా" అని చెప్పి అందరూ దానిని చదవాలన్నాడు.

తన హైస్కూలులో మావో-సే-టుంగ్ కార్యకలాపాలు, అప్పుడే 'నూతన ప్రజాస్వామ్య' స్థాయి నందుకున్నాయి. తన సహజ, సునిశిత పరిశీలనా దృష్టితో, ఆయన "నవ్య సంస్కృతి - నూతన ప్రజాతంత్ర" ఉద్యమ ప్రవాహంలో మునిగి, ముందుకు సాగాడు; అగ్రగామిగా రూపొందాడు. ఆ ఉద్యమంలో పైకుబికిన కొత్తభావాలను తానింకా వికసింపజేసి, హూనాన్‌లో ప్రచారం చేయ నారంభించాడు. కొత్త పత్రికల నన్నిటిని శ్రద్ధగా చదివి, వాటి సారాంశాన్ని పరిశీలించి, క్రోడీకరించేవాడు. దానితోపాటు, వివిధ ప్రాంతాల్లోని నవ్యసంస్కృతి ఉద్యమ కార్యకర్తలతో పోస్టు ద్వారా సంబంధాలు పెట్టుకొనేవాడు.

## ఫ్రాన్సులో చదువు సాగించేందుకు విద్యార్థుల స్వయంసహాయక ఉద్యమ నిర్మాణం

చాంగ్షాలోని ప్రథమ హైస్కూలు చదువు పూర్తయిన తరువాత, ఉత్తరచైనాలోని నవ్యసంస్కృతి ఉద్యమ కార్యకర్తలతో

సంబంధాలు పెట్టుకునేందుకు మావో పెకింగ్ వెళ్ళాడు. అదే సమయంలో, ఫ్రాన్సులో చదువుకోడానికి వెళ్ళదలచిన విద్యార్థుల స్వయంసహాయక కార్యక్రమం గురించి కరపత్రాలు మొదలైనవి హూనాన్ చేరాయి. హూనాన్‌లోనూ, ఇతర రాష్ట్రాల్లోనూ ఉన్నత పాఠశాలలో చదువు పూర్తిచేసుకుని, ఇంకా పై చదువు చదవాలని తహతహలాడుతూన్న నిరుపేద విద్యార్థులకు చక్కని అవకాశం దొరికింది. చిల్లిగవ్వయినా లేని విద్యార్థులుకూడా విదేశాలకు వెళ్ళి చదువుకోగల అవకాశం కలిగిస్తానంటున్న ఆ కార్యక్రమం విద్యార్థులను బాగా ఆకర్షించింది. మావో-సే-టుంగ్, సాయ్-హో-షెన్ మరికొందరూ కలిసి కార్యక్రమాన్ని తీసుకొని ప్రచారం చేశారు. హూనాన్‌లో చాలమంది యువకులను సమీకరించారు. ఫ్రాన్సు వెళ్ళదలచుకున్నవారు ముందుగా పావోటింగ్ నగరానికిగాని, పెకింగ్‌గాని వెళ్ళి కొద్దిగా ఫ్రెంచిభాష నేర్చుకోవాలని ఆ కార్యక్రమంలో ఒక భాగం. తరువాత వారు ఒక ఫ్రెంచినావలో, నాలుగవతరగతి ప్రయాణీకులుగా ఫ్రాన్సు వెళ్ళవచ్చు. హూనాన్‌లోనూ, ఉత్తరాన సాగుతూన్న నవ్య సంస్కృతీ ఉద్యమాలతో సన్నిహితసంబంధాలను నెలకొల్పేందుకు ఒక విధంగా ఈ కార్యక్రమం ఉపకరించింది.

చైనా సమస్యపట్ల చైనా ప్రజల విముక్తిపట్ల మొదటినుంచీ మావో-సే-టుంగ్‌కున్న శ్రద్ధ, దీక్ష ఆయన యవ్వనంలో మరింత ప్రగాఢ మయాయి. ఇక వాటిని చంలిపచేయడం ఎవరితరమూ కాదనిపించింది. చైనా జాతీయ గుణగణాలు, జాతీయ భావాలు జాతీయ విశిష్టత ఆయనలో మూర్తీభవించాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ సప్తమ మహాసభలో 1945 మే 14 వ తేదీ పార్టీ నియమా

వళి సవరణను గురించి తన నివేదికను సమర్పిస్తూ లియొ-షావ్-చి ఇలా అన్నాడు:

"మన చైనా జాతియొక్క ఉత్తమోత్తము సాంప్రదాయాలకు మావో-సే-టుంగ్ సాటిలేని ప్రతినిధి. మార్క్సిజాన్ని కొత్త పరిస్థితులను అన్వాయింపజేయడంలో ఆయన మహాపురుషుడు. మానవ జాతి చరిత్రలో ఉత్తమోత్తము సిద్ధాంతమైన మార్క్సిజం యొక్క సూత్రాలు ప్రపంచాని కంతటికీ చెందినవి. వాటిని, చైనా విప్లవంయొక్క ప్రత్యేక పరిస్థితులను ఎంతో నైపుణ్యంతో అనువర్తింప జేశాడు మావో. మన జాతీయ భావాలను ఇదివరకు కని విని ఎరగని స్థాయికి వికసింపజేశాడు. పీడిత చైనా జాతికి, ప్రజలకు ఏకైక విముక్తిమార్గాన్ని, పంథాను మావో-సే-టుంగ్ చూపాడు."

అవును, నిజం. సహస్రాబ్దాల చరిత్రగల చైనా జాతీయ సాంస్కృతిక సంప్రదాయాలను మావో-సే-టుంగ్ సవిమర్శక దృష్టితో స్వీకరించాడు. ఉజ్వలమైన మన జాతీయ సంస్కృతి ఆయనలో పరిపూర్ణంగా మూర్తీభవించింది. ఆయన భావాల్లోనే అది వికసించి, పునః ప్రజ్వలిస్తూంది. "ఉమ్మడి ప్రభుత్వము" అన్న తన రచనలో మావో-సే టుంగ్ వివరించినట్లు, "ప్రపంచ కార్మిక వర్గంయొక్క సక్రమ, విప్లవాత్మక, శాస్త్రీయ భావ సంపదను కాచి వడపోసిన సారాంశమే మార్క్సిజం, చారిత్రక భౌతికవాదం, గతితార్కిక భౌతికవాదం." వీని నాధారం చేసుకొనే మావో-సే-టుంగ్ చైనా జాతీయ భావసంపద మంచి చెడ్డలను తరచిచూచి, బలపరచి, ఇంకా ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళగలిగాడు; దానికొక శాస్త్రీయమైన స్వరూపాన్ని చేకూర్చ గలిగాడు. మార్క్సిజం అనే సాధనమే లేకపోతే, చైనా జాతీయ సంస్కృతిని తరచి చూడడమూ, దానిని బలపరచి, ఉన్నత స్థాయికి

తీసుకువెళ్ళడమూ, దానికొక శాస్త్రీయ స్వరూపం కలిగించడమూ అసాధ్యమయేది. అదేవిధంగా చైనా చరిత్ర నాగరికతల లోతు పాతులు తెలుసుకోకుండా చైనా జాతీయ సంస్కృతిని మధించ కుండా, చైనా సమాజాన్ని గురించీ, పోరాట అనుభవాలనుగురించీ సమగ్ర పరిజ్ఞానం లేకుండా, మార్క్సిజాన్ని సమన్వయ దృష్టితో నిర్మాణాత్మకంగా, స్వీకరించడం అసంభవమయేది. దానిని అవ గాహన చేసుకొని, దానికొక చైనా స్వరూపాన్నిచ్చి, కామ్రేడ్ లియు-షావ్-చి పార్టీ నియమావళి పైతన ప్రసంగంలో అన్నట్లు, 'ఒక సరికొత్త చారిత్రక సన్నివేశానికి, చైనా ప్రత్యేక పరిస్థితులకు దానిని వర్తింపజేసి,' చైనాలో అది వేళ్ళూనేలా చేయడం అసాధ్య మయేది.

చైనా చరిత్రను గురించి, సమాజాన్ని గురించి తనకున్న సమగ్ర పరిజ్ఞానంతో, చైనా ప్రజా పోరాటాల్లో గడించిన అనుభ వంతో మావో-సే-టుంగ్ మార్క్సిజాన్ని చక్కగా ఆకళించుకో గలిగాడు; చైనా సమస్యలకు దానిని సక్రమంగా వర్తింప జేయ గలిగాడు; విశ్వసూత్రమైన మార్క్సిజాన్ని చైనా విప్లవ కార్యా చరణతో మేళవింపజేయ గలిగాడు.

చైనాదేశానికీ, చైనా ప్రజలకు ఏకైక విముక్తిమార్గాన్ని ఆయన చూపగలిగాడంటే, అందుకు ఆయనలోని ఈ విశిష్టతే కారణం. ఆయనలోని ఆ ఉత్కృష్టతే ఆయనను చైనా భాగ్యవిధాత గానూ, చైనా చరిత్రలో కనీవిని ఎరు[illegible] ఉత్తమోత్తమ నాయ కునిగా చేసింది. మావో-సే[illegible] ఆయన సిద్ధాం తాలూ, ఆచరణ విధా[illegible] ఎన్నో అమూ[illegible] భ[illegible] లను[illegible]

ఈనాడు మావో లాగా చైనాను ఆమూలాగ్రం అధ్యయనం చేసుకున్న వ్యక్తి చైనా కమ్యూనిస్టు పార్టీలోగాని, దానివెలుపలగాని మరొకరులేరు. అంతేకాదు; ఇతరదేశాలను గురించికూడా ఆయన పరిజ్ఞానం అపారం (చైనా సందర్శనార్థం వచ్చే విదేశీయులను వారివారి దేశాలను గురించి ఎన్నో ప్రశ్నలడిగేవాడు. చైనాను గురించి వాళ్ళడిగే ప్రశ్నలకన్నా, వారిదేశాలను గురించి ఆయన అడిగేప్రశ్నలే ఎన్నోరెట్లు అధికంగా ఉండేవి.) జాతీయ సంస్కృతిలోనూ, పాశ్చాత్య విజ్ఞానంలోనూ ఆయనకృషి, అనుభవముచాల ఉన్నతస్థాయికి చెందినవి. బాల్యమునుండి, విధివిరామం లేకుండా, సాగించిన స్వయంబోధన ఫలితమది.

## పెకింగులో

'స్వయం సహాయక' ప్రణాళికపై ఫ్రాన్సులో ఉన్నత విద్యాభ్యాసానికి వెళ్ళదలచినవారు, పెకింగ్ నగరంలో కొద్దిరోజులు ఫ్రెంచి భాషను నేర్చుకోవలసి ఉన్నదని పైన తెలుసుకొన్నాము. ఇందుకోసం తానుసమీకరించిన మిత్రులతోకలిసి మావో-సే-టుంగ్ పెకింగ్ నగరం చేరుకున్నాడు.

అప్పటికి ప్రొఫెసర్ యాంగ్-హువాయ్ చుంగ్ పెకింగ్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉన్నాడు. అతని ఇల్లు సాామెన్ వెలుపల ఉండేది. చాంగ్షా హైస్కూలులో ఆయన విద్యార్థులుగా ఉండిన మావో, అతనితో కలిసివచ్చిన విద్యార్థులూ, చాంగ్షాలో లాగానే ఆయ[illegible]శేవారు. వారియడల ఆయన ప్రేమా[illegible]

[illegible] హానగరంలో ఉన్నంత

ఉండేవాడు. అసలు పెకింగ్‌కు రావడమే అప్పుచేసుకొని వచ్చాడు. అందువల్ల అక్కడకు చేరీచేరడంతోనే ఏదైనా ఉద్యోగంకోసం వెతకవలసి వచ్చింది. ప్రొఫెసర్ యాంగ్ సిఫారసుమీద విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో సహాయాధికారి పదవి లభించింది. పుస్తకాలు, పత్రికలు చదివేందుకు వచ్చేవారందరిపేరులను నమోదు చేయడం అతనిపని. జీతం నెలకు ఎనిమిది డాలర్లు.

గ్రంథాలయాధికారి లీటా-చావో. పెకింగ్ విశ్వవిద్యాలయంలో కూడా ఆయన ఒక ప్రొఫెసరు, ఒకసుప్రసిద్ధ పండితుడు. అభ్యుదయ వాది. అక్టోబరు రష్యన్ విప్లవాన్ని, మార్క్సిజాన్ని చైనాప్రజలకు తొలిసారిగా పరిచయంచేసిందికూడా అతనే. చైనా కమ్యూనిస్టుపార్టీ సంస్థాపకుల్లో ఒక డతడు. తదనంతర ఉత్తర చైనాలో పార్టీకి నాయకత్వం వహించి గణుతికెక్కాడు. అలాంటి ఆ మహనీయుని చాంగ్‌సో-లిన్ అనే సైనిక రాజ్యాధికారి, పెకింగ్‌లోనే 1927 లో గొంతునులిమి చంపాడు. చనిపోయేనాటికి కతనికి నలభై ఏళ్ళయినా నిండలేదు.

అప్పుడు పెకింగ్‌లో ఉంటూండగా యాంగ్-కైహుయ్‌ని మావో ప్రేమించాడు. యాంగ్-హువాయ్-చుంగ్ పుత్రికే ఆమె. ఆమె నిరాడంబరి, శ్రద్ధాళువు. తల్లిదండ్రులు ఆమెకు చక్కగా చదువు చెప్పించారు. మావో గుణగణాలను గురించి ఆమె తండ్రి ద్వారా ఎంతో తెలుసుకుంది. అంతకు ముందే, తండ్రి చాంగ్షా పాఠశాలలో పనిచేస్తున్న రోజుల్లో, నాలు సంవత్సరాలుగ వారిద్దరూ ఒకరి నొకరు బాగా ఎరుగుదురు. తరువాత కొన్నాళ్ళకు చాంగ్షాలోనే వారిద్దరికీ వివాహం జరిగింది.

చింకాంగ్షాన్ పర్వతాల మీదుగా మావో విప్లవ సైన్యాన్ని నడుపుతూన్న రోజుల్లో ఆయన భార్య హూనాన్‌లోనే ఉండి పోవలసి

వచ్చింది. విప్లవ వ్యతిరేకులైన చాంగ్-కై-షేక్ ముఠా ఆమెను పట్టుకున్నారు. మావో ఆచూకీ తెలుపవలసిందిగా ఆమెను ఊహింప రాని చిత్రహింసల పాల్జేశారు. కాని, ఆ వీరపత్ని ఏమాత్రం చలించ లేదు. చివరికా నీచులు ఆమె ప్రాణాలు తీశారు. ఈ దారుణ హత్యను చైనా దేశమంతా అట్టుడికనట్టుడికిపోయింది.

పెకింగులో ఉన్నప్పుడు కూడా మావో గ్రంథాలయంలో తన పని చూచుకుంటూ, స్వయం బోధనా కార్యక్రమం యథాపూర్వం సాగిస్తూనే వచ్చాడు. 'చదవడం-తర్కించడం' అనే పద్ధతులనే అక్కడ కూడా అనుసరించాడు. మావోనూ, అతని మిత్రులనూ ప్రొఫెసర్ యాంగ్, పెకింగులోని అనేక పండితులకు, ఇతర ప్రము ఖులకు పరిచయం చేసాడు. తరువాత ఆ యువకులు తరుచు వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి ఎన్నో విషయాలను తెలుసుకుంటూండేవారు.

ఈ విధంగా పెకింగ్‌లో మావో విజ్ఞానం ఎప్పటికప్పుడు నూతన వికాసం పొందుతూనే వచ్చింది. 'నవ్య సంస్కృతి' ఉద్యమ నాయకుల్లోని కొంతమంది ఆడంబరపరులు; ఈ దక్షిణాది గుమాస్తా గానితో మాట్లాడడం తమ కాలాన్ని వ్యర్థం చేయడమే అని భావిం చినా, మావో క్రమక్రమాభివృద్ధి పొందడం ఏమీ మందగించలేదు.

ఆ రోజుల్లోనే 'అరాచక వాదా'న్ని బోధించే కొన్ని కర పత్రాలు వెలువడ్డాయి; మొదలైన వాటిని మావో చూడడం తటస్థించింది. తక్కిన చైనా యువకుల్లాగానే మావో కూడా కొద్దికాలం పాటు దాని ప్రభావానికి లోనయ్యాడు. కాని, త్వరలోనే అందులోంచి బయట పడి, కమ్యూనిజపు శాస్త్రీయ సిద్ధాంతాల పరిశోధన తిరిగి ప్రారంభించాడు. పెకింగ్ విశ్వవిద్యాలయంలోనే తత్వశాస్త్రాన్నీ, పత్రికారచనను అధ్యయనం చేస్తున్న రెండు విద్యార్థికూటములతో చేరాడు

రాజకీయ, శాస్త్రీయ భావాలయందు ఆయన అభిరుచి ఆరోజుల్లో ద్విగుణీకృత మయింది.

## విప్లవ కార్యకలపాల్లో తలమునకలు; మే నాలుగు ఉద్యమం; విద్యార్థి యువజనోద్యమం; 'సియాంగ్ చియాంగు రివ్యూ' అనే పత్రిక సంపాదకత్వం

ఉన్నతవిద్యాభ్యాసంకోసం ఫ్రాన్సు వెళుతూన్న విద్యార్థులతో కలిసి మావో షాంగ్‌హై బయలుదేరాడు. కాని ఆయనవద్ద ఉన్నటిక్కెటు టీన్‌ట్సిన్ వరకే చెల్లుతుంది. ఒక మిత్రుడు ఇచ్చిన పదిడాలర్లతో ఎలాగో ప్యూకౌ చేరుకున్నాడు. దారిలో ఆగి టాయ్‌షాన్ పర్వతాల నెక్కాడు; కన్ఫ్యూషియస్, మెన్‌యువాన్, మెన్‌షియస్ మొదలైన ప్రాచీన ప్రవక్తల జన్మస్థానాలను, సమాధులను దర్శించాడు అదంతా పూర్తిచేసుకొని ప్యూకౌ చేరుకునేసరికి అతని వద్ద సరిగా రెండుకానులుమాత్రం మిగిలాయి. దానికితోడు దారిలో అతని జోళ్ళను దొంగిలించారు. సమయానికి ఒకపాత విద్యార్థి మిత్రుడు ఆమకొని షాంగ్‌హైవరకు ప్రయాణంచేసేందుకు, కొత్త జోళ్ళు కొనుక్కునేందుకు కావలసిన డబ్బిచ్చాడు.

మావో సమస్య అంతటితో తీరిపోలేదు. అక్కడనుంచి హూనాన్ చేరుకోవాలి. ఫ్రాన్సు వెళుతున్న మిత్రులు, తమఖర్చుల కోసం ప్రోగుచేసుకున్న దానిలోనుంచి కొంతడబ్బుతీసి అతనకిచ్చారు.

ఈ విధంగా నానాతంటాలుపడి మావో చాంగ్షా చేరుకున్నాడు. అక్కడ హూనాన్ విశ్వవిద్యాలయ నిర్మాణానికై యుయెలా పరిషత్తు భవనంలో ఏర్పరచబడిన తాత్కాలిక కార్యా

లయంలో ఆయన వసతి ఏర్పాటు చేసుకున్నాడు. సియాంగ్ నదికి ఇవతలిఒడ్డున ఈ భవనాలు, అవతలి ఒడ్డున చాంగ్షా నగరం.

మావో మళ్ళీ ఒంటిపూట భోజనం ప్రారంభించాడు. అది కూడా మునుపటిలాగానే, పెద్ద చిక్కుళ్ళు అన్నం మాత్రమే. భోజనాది విషయాలు అలా ఉన్నప్పటికీ, తన రాజకీయ కార్య కలాపాలను - ముఖ్యంగా విద్యార్థి ఉద్యమాన్ని, ద్విగుణీకృతోత్సాహంతో, ఇనుమడించిన దీక్షతో కొనసాగించ నారంభించాడు.

మొదటి ప్రపంచ యుద్ధం అప్పుడప్పుడే పూర్తిఅయిన రోజులవి. "...చైనాలో పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ మరికొంత అభివృద్ధి చెందింది. చైనా జాతివిముక్తి పట్ల కొత్తఆశ అంకురించింది. సామ్రాజ్యవాద దేశాల్లో రష్యా, జర్మనీ, ఆస్ట్రియా - హంగరీలు మూడూ పూర్తిగా పతనంకావడమూ, బ్రిటన్, ఫ్రాన్సులు రెండూ బలహీనంకావడమూ చైనాలోని విప్లవకాముక మేధావివర్గం గమ నించింది. రష్యాలో కార్మికవర్గం సోషలిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పు కోవడమూ; జర్మనీ, హంగరీ, ఇటలీ దేశాల్లో కార్మికవర్గ విప్లవాలు ప్రజ్వరిల్లడమూ కూడా వీరు గుర్తించారు." ("నూతన ప్రజా స్వామ్యం") ప్రపంచాన్ని ఉర్రూతలూచిన రష్యా అక్టోబరు సోష లిస్టు విప్లవమూ, లెనిన్ స్టాలిన్ల నాయకత్వంకింద బోల్షివిక్ పార్టీ రూపొందించిన 'జాతుల సిద్ధాంతమూ, చైనా ప్రజలపై ప్రసరించిన ప్రభావం ఇంతంత కాదు.

ఈ విషయాన్నే స్టాలిన్ ఇలా సుస్పష్టంచేశాడు.

"శతాబ్దాల నిద్రావస్థనుండి ప్రాచ్య దేశాలప్రజలను మేల్కొ లిపి, ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోకి వారిని ఆక ర్షించగలిగిన తొలి విప్లవం అక్టోబరు విప్లవం. రష్యాలోలాగానే

ఇరాన్, చైనా, ఇండియూ దేశాల్లో కూడా కార్మిక, కర్షక సంస్థ లేర్పడడం ఇందుకు ప్రబల నిదర్శనం."

మావో అన్నట్లు,

"ఆనాటి ప్రపంచ విప్లవోద్యమమూ, రష్యా విప్లవమూ, లెనినూ అందజేసిన సందేశం ఫలితమే మే నాలుగు ఉద్యమం". ('నూతన ప్రజా స్వామ్యం.')

మొదటి ప్రపంచ యుద్ధానంతరం 1919 లో పారిస్‌లో జరిగిన వార్సెల్ శాంతి సమావేశంలో చైనాకు రాజకీయంగా జరిగిన అవమానానికి చైనా ప్రజలందరూ ఉగ్రులయారు. అదివరకు చైనాపై జపాను విధించిన 21 బానిస షరతులను రద్దుచేయ వలసిందిగా చైనా కోరిన కోరికను నిరాకరించారు. అది తను కార్య క్రమానికి చెందిన విషయం కాదు పొమ్మన్నారు. అలా అంటూనే యుద్ధాన్ని అవకాశంగా తీసుకొని చైనాను కొల్లగొట్ట పూనుకున్న జపానుకు కావలసిన ప్రోత్సాహమంతా ఇచ్చారు. షాంటుంగ్ రాష్ట్రంలో జర్మనీ అదివరకు అనుభవిస్తూండిన సర్వాధికారాలు జపానుకు నప్పగించారు.

1919 మే నాలుగవ తేదీని పెకింగ్‌లో అయిదు వేలమంది విద్యార్థులు, మరికొంతమంది సాధారణ పౌరులు కలిసి పెద్దప్రదర్శనం చేశారు. "జపానుతో రాయబారాలు కూడదు", "దేశద్రోహులను హతమార్చాలి", "వార్సెల్ శాంతి సంధిపై సంతకం పెట్టకూడదు", "21 షరతులను రద్దుచేయాలి", "సియాంగు టావోను ఏమైనాసరే, తిరిగి చైనావశం చేయాలి", "పెత్తనం కోసం పెనగులాట అంత రించాలి", "జపాను సరకులను బహిష్కరించాలి" మొదలైన నినా దాలతో పెకింగ్ నగరం మారుమ్రోగింది. చావో చియా లౌలోని

సావో-జులిన్ ఇంటిని ♦ ప్రజలు తగులబెట్టారు. దేశద్రోహుల్లో ఒకడైన చాంగ్-సుంగ్-సియాంగుకు దేహశుద్ధి చేశారు. ఈ ప్రదర్శనాన్ని చెదరగొట్టేందుకు టువాన్ చి-జుయి ప్రభుత్వం పోలీసులను సాయుధదళాలను పంపింది. 32 మంది విద్యార్థులను అరెస్టు చేశారు. అందుకు ప్రతిక్రియగా, ఆ మరునాడే పెకింగులోని విద్యార్థులందరూ సమ్మెచేశారు. ఆనాడే అక్కడికక్కడ పెకింగు కాలేజీ, హైస్కూలు విద్యార్థుల సంఘం ఏర్పడింది. నిరసన టెలిగ్రాములు, ప్రచారకరపత్రాలు, సభలు మొదలైన కార్యకలాపాలు కొనసాగించింది.

ఈ ఉద్యమం దేశాన్నంతటినీ ఉత్తేజపరచింది. టీన్‌ట్సిన్, షాంగ్‌హై, నాంకింగ్, వుహాన్ నగరాల్లోనూ; క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సి, ఫ్యుకీన్, షాన్సి, షెన్సి, చెకియాంగ్, కియాంగ్సి, హూనాన్ రాష్ట్రాల్లోను; ఈశాన్య చైనా (మంచూరియా)లోనూ విద్యార్థులు ఉప్పెనగా లేచారు. సమ్మెలు, నిరసన సభలు, జపాను సరకుల బహిష్కరణోద్యమం, దేశమంతటా దావానలంలా అలముకున్నాయి. దేశం మారుమూలల్లోని విద్యార్థులూ, యువక మేధావులూ, ఈ జపాను వ్యతిరేక ఉద్యమంలో సమీకృతులయ్యారు.

---

♦ పారిస్ వార్సెల్ సమావేశంలో, షాంటుంగ్ ప్రాంతంలోని జర్మనీ అధీన ప్రాంతాలను, జర్మన్ల హక్కులను అధికారాలను జపానుకు ధారాదత్తం చేయడం జరిగిందన్న వార్త వినగానే చైనా ప్రజల్లో ఆగ్రహావేశ పరవశులయ్యారు. అయిదువేలమంది విద్యార్థులు టీన్ అన్ మెన్ ఎదుట ప్రదర్శనం జరిపి, చావో చియా లౌ వద్దకు ఊరేగింపుగా వెళ్లారు. 1915లో జపాను విధించిన 21 బానిస షరతులకు అంగీకరిస్తూ జరిగిన ఒడంబడికపై సంతకం పెట్టిన ద్రోహి సావో-జులిన్ నివాసమక్కడే. విద్యార్థులచ్చటికి వెళ్ళేసరికి సావో-జులిన్, జపానులోని చైనా రాయబారి చాంగ్-సుంగ్-సియాంగు, ప్రభుత్వ టంకశాల అధిపతులు సుంగ్-యు, ఒక జపాను అధికారి ఏవో మంతనాలు జరుపుతున్నారు. చాంగ్ సుంగ్-సియాంగును పట్టుకొని విద్యార్థులు చితుకగొట్టారు. తక్కిన ముగ్గురూ పారిపోయారు. సావో జులిన్ ఇంటిని విద్యార్థులు తగులబెట్టారు.

సంఘటిత నిర్మాణానికీ, కార్యాచరణకు తహతహ సర్వత్రా ప్రస్ఫుట మయింది.

ఆ రోజుల్లో మావో-సే-టుంగ్ చాంగ్షానగరంలో ఉన్నాడు. మే నాలుగు ఉద్యమాన్ని హూనాన్ రాష్ట్రమంతటా విస్తరింపజేసేం దుకు ఆయన ఒక విజ్ఞాపన పత్రాన్ని రాసి పంచిపెట్టాడు. "సోదర చైనా ప్రజలారా, లేవండి!" అన్న వాక్యంతో ఆవిజ్ఞాపన ప్రారంభ మయింది. అతని కృషి ఫలితంగా హూనాన్ విద్యార్థులు కార్య రంగంలోకి ఉరికారు.

ఆ విద్యార్థులు 'హూనాన్ విద్యార్థి అసోసియేషన్'ను నిర్మించి దానితరఫున 'సియాంగ్ చియాంగ్ రివ్యూ' అనే పత్రికను ప్రారం భించారు. ఆ పత్రికకు ఆపేరును సూచించింది మావో. మావోనే దానికి సంపాదకునిగా విద్యార్థులు ఎన్నుకున్నారు. మొదటి సంచిక లోని తొలిపలుకు రాసింది మావో. ఆసంచికలో సగానికిపైగా స్థలాన్ని ఆ వ్యాసమే ఆక్రమించుకుంది. ఆవేశంతో కూడుకున్న ఆ ఉద్బోధ విద్యార్థిలోకాన్ని మంత్రముగ్ధులను చేసింది.

సామ్రాజ్యవాదాన్ని, జమీందారీ విధానాన్ని, సైనిక రాజ్యాధికారాన్ని ప్రతిఘటించి, ప్రజాస్వామ్యంకోసం, శాస్త్రం, నవ్యసంస్కృతుల అభివృద్ధికోసం పోరాడడం ఆ పత్రిక ఆశయం. ఈ ఆశయాన్ని సాధిస్తూ అది హూనాన్ రాష్ట్రంలోనూ, ఇతర ప్రాంతాల్లోనూ విద్యార్థి, యువజనోద్యమాలను విశేషంగా ప్రోత్స హించింది. హూనాన్‌లోని మేధావులు శాస్త్రకారులు, ఉపాధ్యాయ వర్గాలు అభ్యుదయంకోసం విప్లవంకోసం సాగించిన కృషిలో ఆ పత్రిక అండదండగా వ్యవహరించింది.

నిజానికి ఆ పత్రిక ప్రభావం బహుముఖం. పాత మౌఢ్యాన్ని తూర్పారబట్టి నవ్యసంస్కృతిని ప్రచారం చేయడం ఒక్కటేకాదు అది

చేసినకృషి. ప్రజలవిప్లవపోరాటాల నిర్మాతగాకూడా అది వ్యవహరించింది. నాటిసమాజాన్ని ప్రత్యక్షంగా ఎదుర్కొంటున్న అనేక సమస్యలపై ఆ పత్రికలో చర్చలు సాగేవి.

యువమేధావులను, విద్యార్థులను కార్యోన్ముఖులనుచేసి, ప్రజాసామాన్యంతో వారు భుజంభుజం కలిపేలా చేయడం ఆపత్రిక ప్రధాన లక్ష్యం. సెలవుల్లో ఇళ్ళకువెళ్ళేటప్పుడు ప్రజాసంఘాలలో పనిచేయవలసిందిగా అది విద్యార్థులను ఆదేశించేది. ఒకసారి వేసవి సెలవుల్లో ఇళ్ళకు పోతున్న విద్యార్థులకు కర్తవ్య ప్రబోధంచేస్తూ "మహత్తర ప్రజాఐక్యత" అన్న శీర్షికకింద మావో-సే-టుంగ్ సంపాదకీయం రాశాడు. హూనాన్ విద్యార్థిసంస్థకూడా ఇదేప్రచారం సాగించేది. "ఇళ్ళకువెళ్ళి ప్రజలలో పనిచేయాలి" అనే నినాదంకింద వివిధ పాఠశాలల్లో విద్యార్థులను సమీకరించేది. ఇల్లుచేరుకోగానే ఆవిద్యార్థులు, స్థానిక యువమేధావులతో కలిసి ప్రచారక దళాలుగ ఏర్పడి ప్రజాసంఘాల నిర్మాణ కార్యకలాపాలూ, ఇతర ప్రచారమూ కొనసాగించేవారు. హూనాన్ విద్యార్థిసమితి జపానువస్తు బహిష్కరణోద్యమం జయప్రదంగా సాగేందుకు అవసరమయిన సన్నాహాలు కూడా చేసేవి. అందుకోసం పదేసిమందితో "దేశసేవక దళాల"నూ "శత్రువుల సరకుల పరిశోధక దళాల"నూ ఏర్పరచింది.

హూనాన్ రాష్ట్రంలో అనేక పాఠశాలలు తమ స్వంత వార పత్రికలను నిర్వహిస్తుండేవి. విప్లవ ప్రచార కార్యక్రమంలో నాయకత్వం వహించిన 'సియాంగ్ చియాంగ్ రివ్యూ' పత్రిక వాటి నన్నిటినీ సంఘటితం కమ్మని పిలుపిచ్చింది. తత్ఫలితంగా "వార పత్రికల అసోసియేషన్" అనే సంస్థ ఏర్పడింది. ఆనాటినుంచి ఆయా పత్రికలలో ప్రచారం చక్కని సమన్వయం కలిగి, ఫలప్రదంగా సాగుతూవచ్చింది. హూనాన్ రాష్ట్రంలో విద్యార్థుల, యువ మేధా

వుల భావాలు అచిరకాలంలోనే పూర్తిగా మారిపోయి, నూతన వికాసం పొందాయి. అందుకు ప్రధాన బాధ్యత సియాంగ్ చియాంగ్ పత్రికదీ, దాని సంపాదకునిదీ. విప్లవాత్మకమైన పత్రికా రచనలోనూ, ప్రజల కార్యాచరణకు పురిగొల్పే కరపత్ర ప్రచారం లోనూ, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలోనూ మావో-సే-టుంగ్ కృషికి అది నాందీ వాచకంలాంటిది. ఆయన విప్లవజీవిత చరిత్రలోని తొలి అధ్యాయాల్లో, మహోజ్వల ఘట్టమది. 'సియాంగ్ చియాంగ్ రివ్యూ' పత్రికను చివరకు, ప్రభుత్వం నిషేధించింది.

1919 జూన్ మాసం. దేశం నలుమూలలనుండి విద్యార్థి ప్రతినిధులు తండోపతండాలుగ షాంగ్‌హైనగరం చేరుకుంటున్నారు. జూన్ 16వ తేదీని వారంతా సమావేశమై "అఖిలచైనా విద్యార్థి అసోసియేషన్"ను స్థాపించారు. మే నాలుగు ఉద్యమం సందర్భంలో సాగిన సమ్మెలు విద్యార్థి పరిధినిదాటి, వర్తకులను కార్మికులను కూడా ఆకర్షించసాగాయి. దానితో మే నాలుగు ఉద్యమం ఒక నూతన దశకు పరిణతి పొందింది. "అది 'జూన్ మూడు' ఉద్యమంగా పరిణామం పొందేసరికి మేధావులే కాకుండా, కార్మిక, మధ్యతరగతి ధనికవర్గాలలో అధికభాగం అందులో పాల్గొన నారంభించారు. అది సర్వవ్యాపిత విప్లవోద్యమంగా రూపొందింది. (జూన్ మూడవ తేదీని పెకింగ్ విద్యార్థులంతా ఒక్కసారి వీధుల్లోకివచ్చి ప్రజల నుద్దేశించి ఉపన్యాసాలు ప్రారంభించారు. ఆ సందర్భంలో వేయిమందికి పైగా అరెస్టయారు. షాంగ్‌హైలో ఆవార్త వినగానే వర్తకులు, విద్యార్థులు, కార్మికులూ - అందరూ, పెకింగ్ విద్యార్థులపట్ల సాను భూతి సూచకంగా సమ్మె చేశారు.)" (నూతన ప్రజాస్వామ్యం)

చైనాలో పెట్టుబడిదారీ విధానం అంకురించిననాడే కార్మిక వర్గం జనన మొంది ది. అయినా, 'చైనా విప్లవం - కమ్యూనిస్టు

పార్టీ పాత్ర' అన్న తన రచనలో మావో. సే-టుంగ్ పేర్కొన్నట్లు, "చైనా కార్మికవర్గం, చైనా ధనికవాదంకన్నా వయసులోనూ, అనుభవంలోను పెద్దది. చైనా కార్మికవర్గం జాతీయ పెట్టుబడిదారీ వర్గంతోపాటు ఏర్పడినదిమాత్రమేకాదు. అంతకుముందే చైనాలో పరాయి సామ్రాజ్యవాదులు పారిశ్రామిక సంస్థలను నెలకొల్పిన ఫలితంగాకూడా చైనాలో కార్మికవర్గం ఏర్పడి, పెంపొంద నారంభించింది." ఆపైన "మొదటి ప్రపంచ యుద్ధకాలంలో, చైనాలో జాతీయ పరిశ్రమ మరింత వికసించింది." దానితోపాటు చైనా కార్మికవర్గంకూడా మరికొంత పెంపొందింది.

ఈ విధంగా అభివృద్ధిపొందిన కార్మికవర్గం మే నాలుగు ఉద్యమంతో భుజంభుజం కలిపినప్పుడు, విప్లవోద్యమానికి కొత్త జీవం పోసినట్లయింది. జూన్ 5 తేదీన ఇంచుమించు 70 వేలమంది కార్మికులు షాంగ్‌హైలో సమ్మెచేశారు. లోహపరిశ్రమ, యంత్ర పరిశ్రమ, బట్టలమిల్లులు, ముద్రణాలయాలు, నౌకాసంస్థలు, రైల్వే, ట్రాంవే, బస్సు, టెలిఫోను కంపెనీలు, నూనెమిల్లులు, అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలు, కాగితంమిల్లులు, పొగాకు కంపెనీలు మొదయిన అనేక పరిశ్రమలకు చెందిన కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. టాక్సీ డ్రైవర్లు, మునిసిపల్ కార్మికులు, హోటల్ పనివారు, తాపీపని వారు మొదలయిన ఇతర శ్రమజీవులు కూడా ఆసమ్మెలో పాల్గొన్నారు. షాంగ్‌హై-నాంకింగు రైళ్ళు ఆగిపోవడం అద్భుత ఫలితాల నిచ్చింది.

అదేరోజున షాంగ్‌హై వర్తకులు కొట్లు మూసివేశారు. నాంకింగ్, హాంగ్‌చౌ, క్యుకియాంగ్, టీన్‌ట్సిన్, వుహాన్, ఆమోయ్ లాంటి ఇతర పట్టణాలలోనూ, షాంగ్‌టుంగ్, ఆన్వే రాష్ట్రాల్లోనూ వర్తకులు వారి అడుగుజాడల ననుసరించారు.

టాంగ్షాన్‌లో పెకింగ్-ముక్డెన్ రైల్వే కార్మికులూ, చాంగ్ సిన్ టీన్‌లో పెకింగ్-హాంకౌ రైల్వే కార్మికులూ బ్రహ్మాండమైన ప్రదర్శనాలు చేశారు.

జూన్ 6 వ తేదీ. షాంగ్‌హైలోని "సర్వప్రజాసమితి," ద్రోహులను దండించవలసిందిగా కోరుతూ, పెకింగ్ ప్రభుత్వానికి ఒక తంతివార్త పంపింది. పెకింగ్ ప్రభుత్వం ఆ తంతివార్తను, ఒక ఆజ్ఞా పత్రంగా శిరసావహించక తప్పిందికాదు. సావోజు - లిన్, లుసుంగ్-యు, చాంగ్‌సుంగ్-సియాంగ్ అనే ముగ్గురు జపాను అనుకూల అధికారులను జూన్ 9 వ తేదీని పదవుల్లోంచి తొలగించింది. పారిస్ శాంతిసంధిపై సంతకం చేయము అని కూడా ఆప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. అది వట్టి బూటకపు ప్రకటన కాదని జూన్ 28 తేదీన రుజువయింది. పారిస్‌లోని చైనా ప్రతినిధివర్గం, శాంతిసంధిపై సంతకంపెట్ట నిరాకరించారు. ఆవార్త ప్రపంచమంతటా పాకిపోయి, తీవ్రసంచలనం కలిగించింది.

ఈ సామ్రాజ్యవాద వ్యతిరేక, జమీందారీ వ్యతిరేక ఉద్యమాలకు వేదిక 'నవ్య సంస్కృ'తోద్యమమే. ఈ రాజకీయ ఉద్యమాలను మొదటినుండీ అది పట్టుగొమ్మగానే ఉంటూ వచ్చింది. సామ్రాజ్యవాద వ్యతిరేక, జమీందారీ వ్యతిరేక ఉద్యమాలు అంత తీవ్రరూపం ధరించడంతో, 'నవ్య సంస్కృతీ' ఉద్యమం దేశంలో మూలమూలలకు చొచ్చుకుపో నారంభించింది. "పాత నైతిక సూత్రాలను ఎదుర్కొని కొత్త నీతిని స్థాపించడం; పాత సారస్వతాన్ని ప్రతిఘటించి, కొత్త సారస్వతాన్ని సృష్టించడం" అనే రెండు ప్రధాన నినాదాలకింద ఆ ఉద్యమం దేశమంతటా విస్తరింప నారంభించింది. ఆ రోజుల్లో పత్రికలు, కరపత్రాలు సాహిత్య సంపుటాలు అసంఖ్యాకంగా ప్రచురితమయాయి.

లిటా-చావో రాజకీయ వ్యాసావళి, లు-సున్ నవలలు, కథాని కలు ఆ దశలో వెలువడినవే. (1918 లో లిటా-చావో "ప్రజా విజయం" "బోల్షివిజం దిగ్విజయం" "నవయువ" అనే రచనలను ప్రచురించాడు. 1919 మేలో "మార్క్సిజాపట్ల నా భావాలు," అని, మార్క్సిజాన్ని సమగ్రంగా పరిశీలనచేస్తూ ఒక రచన ప్రచు రించాడు. శాస్త్రీయ సామ్యవాదాన్ని చైనా ప్రజలకు ఎరుక పరిచేందుకు అది ఎంతగానో ఉపయోగపడింది.)

"మే నాలుగు ఉద్యమం నాటికి చైనాలో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడక పోయినా, రష్యా విప్లవాన్ని అభినందించి మేధావులూ, కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అకోరగా గ్రహించినవారూ అప్పటికే చాలమంది ఉన్నారు. మొదట్లో మే నాలుగు ఉద్యమం కమ్యూ నిస్టు మేధావులూ, మధ్యతరగతి పెట్టుబడిదారీ వర్గానికి చెందిన విప్లవాత్మక మేధావి వర్గమూ పెట్టుబడిదారీ మేధావి వర్గమూ (ఆనాటి ఉద్యమంలో మితవాదులు వీరే) కలిసి ఏర్పడిన ఐక్య సంఘటనయొక్క విప్లవ ఉద్యమంగానే సాగింది." (నూతన ప్రజా స్వామ్యం.)

కాని, సాంస్కృతికంగానూ, సిద్ధాంతరీత్యా ఐక్య సంఘ టనగా విప్లవోద్యమాన్ని కొనసాగించి ఆ మేధావి వర్గాలు, కాల క్రమేణా రెండు పక్షాలుగ చీలిపోయాయి. లీటా-చావో, మావో-సే-టుంగ్, చు-చియు-పో, యున్ చుయ్-యంగ్, తది తరులు నాయకులుగా గల ఒక పక్షం అతివాద విప్లవ ప్రజా స్వామ్య దృక్పథంనుండి, శ్రామికవర్గ స్వామ్యవాదం - అంటే కమ్యూనిజానికి పురోగమించింది.

హు-షి నాయకత్వం కిందనున్న రెండవ పక్షం "సిద్ధాం తాల ప్రసక్తి మనకెందుకు. ఆయా సమస్యలను తీసుకొని పరిశీ

లిస్తే చాలు" ననే ధోరణిలో పడింది. దీనిని గమనించి లిడా-చావో "సిద్ధాంతాల సమస్య పునఃపరిశీలన" అనే వ్యాసం రాశాడు. "మార్క్సిజం ప్రభావం చాల విస్తృతంగా ప్రసరించడం ఒక మహత్తర సంఘటన" అని నిరూపించి, హు-షి దృక్పథాన్ని తూర్పార రాబట్టాడు. •సక్రమ పద్ధతులను, సిద్ధాంతాల ప్రాతిపదికకూ, సమస్యా పరిశీలనకూగల అవినాభావ సంబంధాన్ని ఆ వ్యాసంలో తేటతెల్లం చేశాడు.

దానికి జవాబుగ హు-షి "నూతన దృక్పథం అంటే అర్థం" అన్న శీర్షికతో ఒక వ్యాసం ప్రకటించాడు. "చిన్న చిన్న మోతాదుల్లోనే తాను సంస్కరణను కోరుతున్నాననీ, సమస్యలను వాయిదాలమీద పరిష్కరించడమే తన అభిమతమని" అందులో బయటపెట్టుకున్నాడు. మార్క్సిజంపట్ల తన తీవ్రవిముఖతను స్పష్టంచేశాడు. సామాజికవ్యవస్థను ఆమూలాగ్రం పునర్నిర్మించడానికి తాను బద్ధవ్యతిరేకినన్నాడు. తరువాత తనధోరణిని ఇంకా బట్టబయలుచేస్తూ, "సత్పురుషుల ప్రభుత్వస్థాపన తన లక్ష్యమనీ, చైనా ప్రాచీన విజ్ఞానాన్ని పరిశోధించాలనీ" అన్నాడు.

ఆవిధంగా ఆనాటి ధనికవాద మేధావి వర్గంలో అధికభాగం "శత్రువుతో లాలూచీఅయి, అభివృద్ధి నిరోధకపక్షంలో చేరిపోయారు." (నూతన ప్రజాస్వామ్యం.)

"పార్టీ పదజాలం కూడదు" అనే వ్యాసంలో, మావో-సే-టుంగ్ ఆ సమస్యనంతా ఇలా క్రోడీకరించాడు.

"మే నాలుగు ఉద్యమం దాని పరిణామ క్రమంలో రెండు భాగాలుగ చీలిపోయింది. ఒక భాగం, మే నాలుగు ఉద్యమపు శాస్త్రీయ, ప్రజాస్వామ్య సారాంశాన్ని వారసత్వంగా స్వీకరించి, దానిని మార్క్సిస్టు సూత్రాలపై తీర్చిదిద్దింది. కమ్యూనిస్టులు,

ఏసంస్థకూ చెందని మార్క్సిస్టులూ ఆ బాధ్యతను నిర్వర్తించారు. రెండవభాగం ధనికవాద పంథాననుసరించి, అభివృద్ధి నిరోధక మిత వాద పక్షమయింది. అది రీతివాదం (ఫార్మలిజం)లోనే మితవాద ధోరణిని అనుసరించింది."

మే నాలుగు ఉద్యమంలాగానే సిన్ మిన్ సొసైటీకూడా అతి వాద మితవాద పక్షాలుగ చీలిపోయింది. దానిసభ్యుల్లో అల్పసంఖ్యా కులు, నిస్పృహలోపడి తమదారినితాము పోయారు. కాని అధిక సంఖ్యాక సభ్యులలో వెనుకటి ఉత్సాహమూ, అభ్యుదయ పోకడా ఏమాత్రమూ సట్టుసడలలేదు. వారు మావో-సే-టుంగ్ ఆదర్శాన్నే అనుసరించి ఆయన నాయకత్వంకిందనే పురోగమించారు. సామాజిక రాజకీయ ఆర్థిక, సాంస్కృతిక రంగాలు ఆమూలాగ్రం మార్పు చెందాలనే తమ కోర్కెను విసర్జించలేదు.

ఒక విధంగా చెప్పాలంటే మే నాలుగు ఉద్యమం విఫల మయింది. కార్మిక, కర్షక ప్రజాసామాన్యాన్ని తగినంతగా అందులో సమీకరించ లేకపోవడమే అందుకు ముఖ్య కారణం. కొంతమంది కార్మికులు అందులో చేరినమాట నిజమే. కాని అవి తగినంత స్థాయిలో జరగలేదు. "కార్మిక, కర్షక ప్రజాసామాన్యంతో చేతులు కలపకపోతే, మేధావులు దేనినీ సాధించలేరు." (మే నాలుగు ఉద్యమముమీద మావో వ్యాసం.) మే నాలుగు ఉద్యమం సాధిం చిన విజయాలుకూడా చాలా ఉన్నాయి. "సిద్ధాంతరీత్యా, కార్య కర్తల దృష్ట్యా. మే నాలుగు ఉద్యమం, 1921 లో చైనా కమ్యూ నిస్టుపార్టీ సంస్థాపనకు, మే 30 ఉద్యమానికి, ఉత్తరజైత్రయాత్రకు, మార్గం సుగమం చేసింది." (నూతన ప్రజాస్వామ్యం)

♦ ♦ ♦ ♦

స్వయం సహాయక కార్యక్రమా న్ననుసరించి ఫ్రాన్సులో ఉన్నత విద్యాభ్యాసానికి మొత్తం మూడువేలమంది బయలుదేరారు.

హూనాన్ నుండి, సుమారు నాలుగువందల మంది విద్యార్థులూ, సూటె-లిలాంటి అభ్యుదయ కాముక ఉపాధ్యాయులు బయలు దేరారు. షాంగ్‌హైనుండి వారంతా జట్టుజట్టులుగా బయలు దేరారు. అది 1920 వేసవి. మావో అప్పుడు షాంగ్‌హై లోనే ఉన్నాడు. "చాంగ్‌చింగ్-యావోను తప్పించవలసిందే" అన్న యునాన్ ప్రజా ఉద్యమం పనిమీదా, సైనికరాజ్యాధికారులకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఉద్యమాన్ని దేశవ్యాపితం చేసేందుకు ఆయన రెండవ సారి షాంగ్‌హై వచ్చాడు. ఒకనాడు హూనాన్ విద్యార్థుల జట్టు ఒకటి ఫ్రాన్సుకు బయలుదేరుతున్నదని విని మావో వారికి వీడ్కోలు చెప్పేందుకు నౌకాశ్రయానికి వెళ్లాడు.

వాంగ్‌పూనది. సూర్యరశ్మిలో మిలమిల మెరిసిపోతోంది. ...న్సుకు బయలుదేరుతున్న వారూ, వారికి వీడ్కోలు చెప్పవచ్చిన వారూ, బరువెక్కిన గుండెలతో విచారంగా ఉన్నారు. తలెత్తి ఒకరి ముఖంలోకి ఒకరు చూడడం కష్టమనిపించింది. అయినా ఒకరి ముఖాల నొకరు, హృదయ ఫలకంమీద నాటుకోడానికా అన్నట్లు చాలసేపు తనివితీర చూచుకున్నారు. ఓడబయలుదేరేందుకు ఇంకా కొంత వ్యవధి ఉంది. మావో-సే-టుంగ్, దూరదేశం పోతున్న తన మిత్రులకు వీడ్కోలుగ ఒకసారి చేయూపి, ఓడ లంగరెత్తకముందే వెనుదిరిగి వచ్చేసాడు. మరికొద్ది సేపట్లోనే ఆయన షాంగ్‌హై జన సమూహంలో లీనమైపోయాడు.

అలాగే, ఆయనస్థానం ఎల్లప్పుడూ ప్రజలమధ్యనే. శతాబ్దాల బాధల బరువుతో, నిన్నమొన్నటివరకు కుంగిపోయిన చైనా ప్రజాసమూహం మధ్యనే ఆయనస్థానం. చైనా జాతి విముక్తినే తన జీవిత పరమావధిగా చిన్నతనంలోనే స్వీకరించాడు. నాటి నుండి, ఒక్క క్షణంకూడా ఆ లక్ష్యంనుండి తనదృష్టిని మరల్చలేదు.

ఆ లక్ష్య సాధనకోసం తన విప్లవ కార్యకలాపాలను - కమ్యూనిస్టు విప్లవ కార్యకలాపాలను - బహుముఖంగా విస్తరింపజేశాడు.

ప్రారంభంలో, పాత సామాజిక వ్యవస్థను, జమీందారీ పీడనను, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే జాతీయ ప్రజాతంత్ర వాది. ఆ స్థితినుండి అతివాద విప్లవ ప్రజాతంత్రవాదిగా రూపొందాడు. తదనంతరం శ్రామికవర్గసిద్ధాంతాన్ని జీర్ణించుకొని, శాస్త్రీయ సామ్యవాదిగా పరిణతిపొందాడు. నాటినుండి మార్క్సిజం-లెనినిజం, చైనా విప్లవ పోరాటఅనుభవం ఆయన చేతిలో రెండుదివ్యాస్త్రాలు.

అతి నేర్పుతో ఆరెండు సాధనాలను వినియోగిస్తూ, ద్విగుణీకృత దీక్షాబలంతో ఇనుమడించిన ఆత్మ విశ్వాసంతో, చైనా శ్రామిక జనసామాన్య జాతీయ, సామాజిక విముక్తి పోరాటా ముందుకు నడిపాడు మావో. చైనా ప్రజల జాతీయలక్ష్య సాధన నిండు హృదయంతో తన జీవితాన్ని అంకితం చేశాడు మావో సే-టుంగ్.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B173 |
| పుస్తకం పేరు | మావో సేటుంగ్ జీవితచరిత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 88 ,72,50,52,32 |
| లేని పేజీలు | 89,90 |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |